

ఓరుగల్లు కాకతీయ కళాసమితి జనవరి ఉత్సవాలలో ప్రదర్శించబడిన శ్రీ ప్రతాపరుద్రుని చిత్రపటం.

ఆంధ్రపత్రిక

| సంవత్సరచందా రు. 12-0-0 విడిప్రతిక 4 అణాలు | ప్రతి బుధవారము ప్రకటింపబడును | సంపుటము 44 సంచిక 29 26-3-52 |
| --- | --- | --- |

Founder: K. NAGESWARA RAO

నందన సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి బుధవారము

## విషయానుక్రమణిక



# మద్రాసు శాసనసభల సమావేశం

1946 లో ఎన్నుకోబడిన మద్రాసు శాసనసభల అంత్య సమావేశం 15 వ తేదీని ప్రారంభమయింది. ప్రతిమారూ సమావేశారంభంలోనైనా కనపడే రద్దీ, హడావిడీ ఈమారు ఆరంభంలోకూడా కనపడలేదు. మొత్తం నూరుమంది ఉంటారేమో హాజరైనవారు. ఎన్నికల్లో ఓడిపోయినవారిలో చాలమంది కనపడలేదు. గెల్చినవారిలో ప్రస్తుత సభ్యులు కానివారు ప్రేక్షకుల గాలరీలో కూచుని ఒకసారి శాసనసభ నడక ఎలా ఉంటుందో రిహార్సల్ చూసుకున్నారు.

వచ్చిన కొద్దిమందిలో కొందరిలో బొత్తిగా నిరుత్సాహం, నిస్పృహా, నిర్లక్ష్యం గోచరించాయి. కొందరు మరీ హుషారుగా కనపడ్డారు. ఇటువంటి వాలకం చూసే కాబోలు అమెరికాలో ఇలాటివాటిని 'కుంటి సమావేశాలు' అంటారు. ఇక్కడ వెన్నువిరిగినవారూ, కాస్తంతలో పడి లేచినవారూ, విజయోత్సాహంతో వెన్ను విరుచుకుతిరిగే వారూ కూడా తమ కర్తవ్యాన్ని పాటించాలనే భావంతో ఈ 'కుంటి సమావేశం'లో పాల్గొన్నారు. సమావేశం కుంటి దేలా అవుతుందో తెలియదు కాని చర్చలు, ముఖ్యంగా ప్రశ్నోత్తరాలు బొత్తిగా కుంటిగా ఉన్నాయని చెప్పాలి. పెద్దలెలాగైనా పెద్దలే. (కౌన్సిల్ సభ్యుల్ని పెద్దలన వచ్చు కాని ఎసెంబ్లీ సభ్యుల్ని చిన్నలన కూడదు) కౌన్సిల్ సభ్యుల్ని ఎలక్షన్ జయాపజయాలు అంతగా (అంటే ఎసెంబ్లీ సభ్యులతో పోలిస్తే) కలవరపరచలేదని పిస్తుంది. సూర్యనారాయణరావుగారు, లక్ష్మణస్వామి మొదలియార్ గారు ఇతరులు ఎప్పటి రీతిగానే అన్ని అంశాలన్నా శ్రద్ధగా ఏకాగ్రతతో పరిశీలించి మరీ చర్చించారు. సూర్యనారాయణరావు గారి ప్రశ్నల జోరు కొంత తగ్గినా, వారి ఉపన్యాసంలో విమర్శ ఒకే రీతిగా ఉంది.

అసెంబ్లీలో ప్రతికూలపక్ష నాయకులుగా శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు హుషారుగా మాట్లాడారు. అసెంబ్లీలో కృష్ణా-పెన్నారు ప్రాజెక్టు ప్రసక్తి వచ్చేసరికిమాత్రం కొంత వేడి కనపడింది. కొత్త సభానాయకులు మంత్రి పి. టి. షెట్టిగారు సౌమ్యభావంతో అందరికీ తగిన సమాధానాలిస్తూ సమర్థులనిపించుకున్నారు. కొత్త మంత్రివర్గంలో ముఖ్య మంత్రిగానో సభానాయకులుగానో ఉండగల అంతస్తు నిరూపించుకున్నారు.

మంత్రిపదవులనుంచి విరమించుకున్న వారిలో కొందరి ఉపన్యాసాలు మాత్రం ఆశ్చర్యం కలిగించినాయి. ఆహారవస్తువుల పై కంట్రోల్, ధాన్య సేకరణ విధానంవల్లనూ, మద్యనిషేధవిధానం వల్లనూ ఎన్నికల్లో కాంగ్రెస్‌కి పరాజయం కలిగిందనే భావం సభ్యులలో కొందరు సందేహమాత్రంగా సూచించారు. ఈ రెండు అంశాలలోనే కాక ఇతర కార్యక్రమాల్లో కూడా ప్రభుత్వం తలపెట్టిన మేరకు ఏ కార్యమూ తృప్తికరంగా కొనసాగలేక పోయినమాట నిజమే. అయితే అంతమాత్రానికి ఆ కార్యక్రమాలు తప్పిదాలనుకోడం సబబు కాదు. అవి సక్రమంగా అములుజరపబడక పోడానికీ ప్రజల సహకారం వానికి లోపించడానికీ నెహ్రూగారు చూపిన ప్రధాన లోపమే కారణం. అధికార పదవుల్లో ఉన్నవారూ, కాంగ్రెస్ పక్షానికి చెందిన నాయకులూ ప్రజలతో సన్నిహిత సంబంధం ఏర్పరుచుకోలేదనీ, సామాన్యంగా ప్రజానీకాన్ని తృప్తిపరిచేవిధంగా పరిపాలనా విధానం కొనసాగలేదనీ (అంటే లైసెన్సులు, పర్మిట్లు వగైరా పాతపాట) చెప్పుకుంటున్నాం. ఈ లోపాన్ని తీర్చుకోడానికి ప్రయత్నించాలి కాని ప్రజలకి సమ్మతమానో కాదో ప్లెబిసైట్ ద్వారా తెలుసుకోవాలని ఇన్నాళ్ళ తరవాత అనడం సవ్యంకాదు. ఆ కార్యక్రమాలు ప్రజాహితమైనవని ఆత్మవిశ్వాసంతో ప్రారంభించారు. ఇంక ప్రజల తోడ్పాటు పొందడానికి ప్రయత్నించడం ప్రస్తుత కర్తవ్యం. మాధవమీనన్ గారు, తమ అనుభవాలను కొన్నిటిని కొన్నిల్లో వివరించారు. కాంగ్రెస్ సంస్థ సభ్యులుగా ఇట్టి వారి అనుభవాలు పరిపాలనా విషయాలలో ప్రజల తోడ్పాటు సంపాదించడానికి తోడ్పడగలవు.



# ★ మద్రాస్ డైరీ ★

గతవారం నగరంలో జరిగిన సంఘటనలన్నిటిలోకీ ఎన్నదగినది యెహూదీ మెనూహిన్ వయొలిన్ కచేరీ. మెనూహిన్ బాల్యంలోనే వయొలినిస్టుగా ప్రసిద్ధి పొందాడు. బాల్యంలో కళా ప్రతిభ చూపించినవారు వయస్సు ముదిరిన కొద్దీ కళలో వెనుకబడిపోవటం తరుచుగా జరుగుతూ వుంటుంది. మెనూహిన్ వయస్సు వస్తున్న కొద్దీ ప్రతిభలో కూడా కొత్త ఔన్నత్యాలు అందుకో గలిగాడు. నేడు ప్రపంచంలో ఉత్తమ వయొలినిస్టులుగా పరిగణింపబడుతున్న కొద్దిమందిలో మెనూహిన్ ఒకడు. భారత ప్రధాని స్థాపించిన జాతీయ సహాయనిధికి ధన సేకరణ చేయాలనే ఉదారాశయంతో మెనూహిన్ భారతదేశం వచ్చాడు. ఢిల్లీ, బొంబాయి, బెంగుళూరులలో కచేరీలు చేసి గతవారం మద్రాసు వచ్చాడు. మ్యూజియం ప్రదర్శన శాలలో కచేరీ జరిగింది. టిక్కెట్లన్నీ చాల రోజులు ముందుగానే అయిపోయినై. కొద్ది టిక్కెట్లుమాత్రం ప్రదర్శన శాలవద్ద అమ్మారు. అవైనా సాయంత్రం ప్రదర్శనానికి పొద్దుటినించీ 'క్యూ' లో నుంచున్న వారికిమాత్రం దొరికాయి. మెనూహిన్ సంగీతం వినాలని ఆశలు పెట్టుకుని కూర్చున్న అనేకులకు ఆశాభంగం కలిగింది. కాని మద్రాసు రేడియో కేంద్రంవారు కచేరీలోని కొన్ని భాగాలు ప్రసారం చేయటం మూలాన పలువురకు పరోక్షంగానైనా మెనూహిన్‌ని వినే అవకాశం లభించింది. ఇందుకు ఆలిండియా రేడియో వారిని అభినందించ వలసి వుంది.

మెనూహిన్ వాయించిన గీతాలలో పగానినీ (ఇటాలియన్) కృతులు ఉత్తమోత్తమంగా భావించబడుతున్నవి. పగానినీ కాక బీతోవెన్, బాక్, షూమన్, మాక్స్‌బ్రూక్ మొదలైనవారి కృతులు, రెండు స్పానిష్ నృత్యగీతాలు వాయించాడు. భారతీయ సంగీత సంప్రదాయానికి అలవాటుపడిన మనకు విజాతీయమైన పాశ్చాత్య సంగీతానికి విలువలు కట్టడం కష్టం. కాని ఆ సంగీతంతో ఏమాత్రం శ్రుత పరిచయం ఉన్నవారికైనా మెనూహిన్‌ని వింటుంటే వయొలిన్ వాద్యం మీద సంపూర్ణాధికారం ఉన్నవాడు వాయిస్తున్నట్లు అనిపిస్తుంది.

* * *

మొన్న 20 వ తేదీన మ్యూజియంలో "శంకర్స్ వీక్లీ" (ఢిల్లీ) వారు అంతర్జాతీయ బాలచిత్ర ప్రదర్శనం ఏర్పాటుచేశారు. ప్రదర్శనం గవర్నరు శ్రీ ప్రకాశ గారిచే ప్రారంభించ బడినది. ప్రారంభసందర్భంలో మద్రాసులోని పురప్రముఖులు, మంత్రులు, ఢిల్లీనుండి వచ్చిన శంకర్ హాజరయ్యారు. ప్రదర్శనంలో అర్జెంటినా, ఆస్ట్రేలియా, సింహళం, కెనడా, చైనా, జెకోస్లావాకియా, ఫ్రాన్సు, ఫిన్లెండు, ఇండొనీషియా, బెల్జియం, ఇండియా, జపాన్, స్విట్జర్లెండ్, టర్కీ, అమెరికా, బ్రిటన్, రష్యా దేశాల బాలబాలికలు పంపిన చిత్రాలు ప్రదర్శితమైనవి. పదహారేళ్ళలోపు పిల్లలు పంపిన బొమ్మలు మాత్రమే స్వీకరించ బడినై.

పదేళ్ళలోపు పిల్లలు వేసిన బొమ్మలు చూస్తుంటే, ముఖ్యంగా అయిదారేళ్ళ వారిబొమ్మలు చూస్తే సర్రియలిజమ్, క్యూబిజమ్, డాడాయిజమ్, ఫాక్ ఆర్ట్ ఇత్యాది గొప్ప గొప్ప నామధేయాలతో చెలామణీ అయ్యే చిత్రలేఖనానికి ఏమీ తీసిపోవనిపించింది. నామటుకు నాకు కొన్ని కొన్ని బొమ్మలు, అయిదేళ్ళ వారిచేత వేయబడినవి, పికాసో బొమ్మలని చెప్పినా నమ్మటానికభ్యంతరం లేనట్టుగా కనబడినై. అన్ని దేశాల వారి బొమ్మలలోను మన దేశపు వారివే ఉత్తమస్థాయిలో ఉన్నాయనుకుంటాను. ముఖ్యంగా రెండు మూడు రూప చిత్రాలు వయస్సుకు మించిన ప్రతిభ చూపిస్తున్నాయి. తరవాత ఎన్నదగినవి రష్యన్, జపానీస్ పిల్లల బొమ్మలు. రష్యన్ బొమ్మలలో ఆకృతి (*Form*)

(46-వ పేజీ చూడండి)



గత 19, 20 తేదీలలో మద్రాసులో వయొలిన్ కచేరిచేసిన యెహూదీ మెనూహిన్



# 1

అది ఒక వైభవోజ్జ్వలమహాయుగం — కల్లకాటి అధ్వాన్నశకం; వెల్లివిరిసిన విజ్ఞానం — బ్రహ్మరాక్షసుడిలా అజ్ఞానం; భక్తి విశ్వాసాల పరమపరిఢవం, — పరమ పాషండాల ప్రళయకల్లోలం; ఉజ్జ్వల చైతన్యాల ఉత్ఫుల్లమహోదయం — అంధాంధతమసాల అవ్యక్త నిశీథం; ఆశాకుసుమాలు పుష్పించిన ఆమధురవసంతం — నైరాశ్యపు చలిగుబుళ్లు ఈచుకున్న శిశిరాశ్యం; సర్వసంపత్సమృద్ధి; సర్వతోముఖక్షామం; స్వర్గానికి రాచబాట పుచ్చుకున్న జనం — నడుస్తున్నారు నరకానికి సూటిగా; అరుస్తున్నయ్ అధికార కంఠాలు, అంతా అమోఘంగా వుందని — సూక్ష్మంగా చెప్పాలంటే, నేటి పరిస్థితికి నకలుగా వుంది నాటిపరిస్థితి. గవిడిగవదల ఓ రాజా, గాజుకళ్ళ ఓ రాణీ ఇంగ్లండులోనూ, గవిడిగవదల ఓ రాజా కలువకన్నుల ఓ రాణీ ఫ్రాన్సులోనూ రాజ్యంచేస్తున్నారు. ఉభయదేశాలలో కూడా, ప్రభుత్వ ఆహారనిల్వల అజమాయిషీలో వున్న దొడ్డ ప్రభువులంతా, సమస్త వ్యవహారాలూ శాశ్వతంగా పరిష్కారమై స్థిరపడిపోయాయనే నిశ్చింతతో కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు.

ఏసుప్రభువు ఈ గడ్డమీద అవతరించి అప్పటికి 1775 సంవత్సరాలు. ఆ సుదినాలలో భూతప్రేత దేవగణాలు ఆంగ్లప్రజలను అనుగ్రహించినవారై, అనేక దేవరహస్యాలను వెల్లడించి దివ్యజ్ఞానసంపన్నులను చేస్తున్నారు — ఇప్పటి మోస్తరుగానే. కొద్దిరోజులక్రితమే సౌత్ కాట్ సతి 25 వ జన్మదినోత్సవం జరిగింది. ఆ సందర్భంలో, ఆవిడగారిలో యేదో దివ్యతేజం ప్రకాశించుతున్నట్టు, రాజుగారి అంగరక్షకదళంలోని ఒక సైనికుడు గమనించాడు — స్వతః దివ్యదృష్టిగలవాడు గనక. ఆ దివ్యసందర్శనాన్ని పురస్కరించుకుని, లండన్ వెస్టుమినిస్టర్లు కాలగర్భంలో అంతరించిపోవటం దైవనిర్ణయమైనట్టు జోస్యం చెప్పాడు. దివ్యసందేశపరంపరను దైనిక కార్యక్రమంగా తలుపులుతట్టి ఉద్ఘాటించి విడిచిన కాక్ లేన్ భూతం * అదృశ్యమై అప్పటికింకాపన్నెండు సంవత్సరాలు కూడా కాలేదు.

గత సంవత్సరం కూడా కొన్ని సన్నరకం భూతాలు (స్వకపోలకల్పన విషయంలో దివ్యత్వం కొరవడినవే అయినా) అనేక సందేశాలను కాకిఘోషగా అరిచేసినై. దివ్యసందేశాలవిషయం ఇలా వుండగా అమెరికాలోని బ్రిటిష్ పౌరమహామండలినుంచి ఆంగ్లరాజుకూ ఆంగ్లప్రజలకు లోకవ్యవహారానికి సంబంధించిన మరికొన్ని సందేశాలు అందినై. చిత్రమేమిటంటే కాక్ లేన్ సంతతి క్షుద్రభూతాల దివ్యసందేశాలకంటే, ఈ లోకవ్యవహార సందేశాలే నరజాతికి అత్యంత ప్రధానమైనవిగా పరిణమించినై.

---

* కాక్ లేన్ భూతం అంటే అభూతకల్పన అని అర్థం. 1762 లో స్మిత్ ఫీల్డ్ లో కాక లేన్ అనే సందులో ఒక ఇంట రెండేళ్ళకుముందు చనిపోయిన ఒక స్త్రీ ఇంటినిపట్టి ఇంటిలోని వారిని భయపెట్టి పీడించినట్లు ప్రవాదప్రబలింది. చనిపోయిన స్త్రీ హత్యగావింపబడినట్లు ఆమె భర్తపై నేరంమోపే ఉద్దేశంతో ఆ ఇంటిలో నివసించే పార్సన్స్ కుటుంబం కుట్రపన్ని ఈ ప్రవాద పుట్టించారట.

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

కవచకార్మికాల గలగలలతో నడుస్తున్న తన సోదర దేశానికి సిద్ధించిన అవధికి, దివ్యజ్ఞానచైతన్యం ఫ్రాన్సుకు సిద్ధించలేదు. కాని, తోచినమటుకు కాయితంకరెన్సీ అచ్చువేసుకుని, విలాస భోగాలకు ఖర్చుపెట్టుకుంటూ పర్వతాగ్రంనుంచి బహు సునాయాసంగా క్రిందికి దొర్లుకొస్తోంది—పట్టుపరుపులమీదినుంచి దొర్లినట్టు. ఇంతేగాదు—క్రైస్తవమత గురువుల ఆశీరాదేశాలతో మానవత్వసిద్ధికి తార్కాణాలైన అనేక మహత్కార్యాలను సంఘటించి వినోదించుతోంది. శిక్షలు విధించి యువకుల కాళ్లూ చేతులూ తెగ నరికించటం, శ్రావణాతో పీకించి నాలికలు చీలికలు చేయించటం, మురికి ఫాదిరీల ముఠా యేదో ఒకటి అలా త్రోవను పోతుంటే, బురదానీళ్లలో బోర్లబొక్కలుగాపడి జోహారు చెయ్యలేదనే నేరానికి, బ్రతికున్న మనిషిని బ్రతుకున్నపళంగా పచ్చి జీవాలతో కాల్చి చంపించటం—ఇత్యాదయః, అనేక సత్కార్యాలలో మునిగి తేలుతోంది. ఆ హత్యలన్నిటికీ ప్రతి చిహ్నాలుగా ఫ్రాన్సు నార్వే మానవారణ్యాలలో, అనోరకం కొత్తచెట్లు మొలకలెత్తి వేరు తన్ని పెరుక్కొస్తున్నయ్. 'కిరాతవిధి' వాటి కన్నిటికీ అప్పటికప్పుడే గుర్తులు పెట్టుకొస్తున్నాడు. అవి పెరిగి పెద్దవైతే వాటి బల్లలతో యీటెలూ బల్లాలూ అమర్చిన ఒక ప్రళయ రథాన్ని నిర్మించాలనే ఉద్దేశంతో—మానవ చరిత్రలో ఒక మహా భీభత్సాన్ని సృష్టించాలనే సంకల్పంతో. అదే సమయంలో పారిస్ పరిసరాలలో, మురుగుబాడవలూ మొండిబంజర్లూ దున్నే మోట రైతుల గొడ్లదొడ్లలో వందలాది నాటు బళ్లు వరుసలుగా విడిసివున్నయ్. ఇరుసుల దాకా రేవడి చుట్టుకున్న వాటి చక్రాలను పందులు మోరలతో వాసన చూస్తున్నయ్. 'మృత్యుకర్షకుడు' వాటిని చూచి తల పంకించాడు—విప్లవ శవవాహనాలకు వెతుక్కోనక్కరలేదని. 'కిరాతుడూ' 'కర్షకుడూ' ఇలా నిర్విరామంగా సన్నద్ధులౌతున్నా కూడా—బయటికి మాత్రం ఏ విధమైన అలజడీ లేదు. పంజాలు ముడుచుకున్న వారి పద ధ్వనులను ఏ ఒక్కరూ పసిగట్ట లేకపోయారు. పసిగట్టలేక పోవటం లేదు—వాళ్లిద్దరూ మేలుకున్నారని భావించటం నిరీశ్వరవాదమూ, దేశద్రోహమూ గనుక యే ఒక్కరూ అలాంటి మహాపాపానికి పూనుకోలేదు.

ఇంగ్లండులో: శాంతి భద్రతలన్నీ సర్వనాశనమై, అరాచకం విచ్చలవిడిగా వీరవిహారం చేస్తోంది. ప్రొద్దు గర్భానపడటం భయం సాయుధ ముఠాల నడివీధి దోపిడీలూ, బందిపోట్లూ, రాజధాని నగరంలోనే దినదినం నిరాఘాటంగా సాగిపోతున్నయ్. ఇంట్లో వున్న కొయ్యసామాను గేళీలూ, ఏ గిడ్డంగులలోనో భద్రపరుచుకోకుండా, ఇళ్లు తాళాలు వేసి బయటి ఊళ్లకు వెళ్లటం సురక్షితం కాదని అధికారులు గృహస్థులను బహిరంగంగా హెచ్చరించారు. పగటివేళ వర్తక శిఖామణిగా బజారులో చెలామణీ అయ్యే మర్యాదస్తుడే, రాత్రి వేళ కొంపలు లూటీలు చేసే గజదొంగః తోటి వర్తకుడెవడేనా గుర్తుబట్టి నిలవేస్తే, అమాంతం పరాక్రమించి, పిస్టలుతో పరిశీట్టలా వాణ్ణి నేల కూల్చేసి, రివ్వున గుర్రంమీద ఉడాయించేస్తాడు. ఏడుగురో ఎనమండుగురో రోడ్డు వెంట పోతున్న 'మెయిల్ కోచ్'కి అడ్డం తగులుతారు. మెయిల్ గార్డు, తన దగ్గిర తూటా లున్నంతవరకూ, వాళ్లల్లో యే ముగ్గురో్ నలుగురో్ కాల్చి చంపుతాడు. గార్డుదగ్గిర మందుగుండు నిండుకున్నదని తెలియగానే మిగతావాళ్ళు అమాంతం వాడిమీద పడి ఖూనీ చేస్తారు. ఆపైని మెయిల్ కోచ్‌లోవున్న సర్వాన్నీ ప్రశాంతంగా దోచుకుంటారు లండన్ సర్వాధికారి లార్డ్ మేయర్ను పట్టపగలు 'టరన్‌హామ్ ఫార్క్'లో నిలవేసి, సర్వపరివార సమక్షంలో, ఒకేఒక పిస్టల్‌వాలా నిలువుదోపు చేస్తుంటే అదేమన్న దిక్కులేదు, తక్కిన సామాన్య ప్రజమాట లెక్కేవిటి? రాచనగరు అతిథిమందిరాల్లో రాణువులతోసహా పరివేష్టించి వున్న దొడ్డప్రభుల రత్నహారాలను తుంటె దొంగలు దూసుకు పోతున్నారు. దొంగసొత్తు సోదాకోసం, రాణువు సిపాయిలు బయలుదేరితే, సెయింట్ గైల్సులు గాడీజనం, తిరగబడి తుపాకులు పేల్చారు. అందిన జనాన్ని అందినట్టు సిపాయిలు కూల్చారు. ఇన్ని జరుగుతున్నా వీటి నెవ్వడూ విపరీత విషయాలుగా పరిగణించటం లేదు. ఈ గందరగోళాల మధ్య ఉరిదీసే ఉద్యోగుల అవస్థ ఊపిరిసలపకుండావుంది. తెల్లవారితేస్తే చిల్లరమల్లర నేరస్థుల్ని ఒక దండా దండా ఉరికంబానికి వ్రేలాడదియ్యాలి; మంగళవారం నాడు పట్టుకున్న మరో కన్నగాణ్ణి శనివారంనాటికి ఉరిదీసెయ్యాలి; చేతిలో మిగిలివున్న డజనుమంది నరపశువుల్ని న్యూగేట్ రుద్రభూమిలో, పచ్చి జీవాలతో నిలువునా కాల్చాలి. వెస్టుమినిస్టరు హాలుముందు కరపత్రాల గుట్టకు నిప్పుపెట్టాలి; ఈ పూటకి పరమ కిరాతుడైన ఒక హంతకుణ్ణి ఖూనీ చెయ్యాలి, రేపు కాపు కుర్రాడిచేతిలో కానీ కాజేసిన, దరిద్రపుగొట్టు వెధవను మరొకణ్ణి హత్య చెయ్యాలి.

ఇలాంటివీ, ఇలాంటివి ఇంకా వేలూ లక్షలూ సంఘటనలు, 1775 లోనూ అనంతరమూ కూడా విధీ విరామం లేకుండా సాగిపోయినై. ఈ పరిస్థితులమధ్య 'కిరాతుడూ' 'కర్షకుడూ' అంతు తెలియని అజ్ఞాతంలో సన్నద్ధ లౌతూన్న వాతావరణంలో, గవిండిగవదల యిద్దరూ, కలువ, గాజుకన్నుల యిద్దరూ, దైవదత్తమైన తమ అధికారాన్ని నిష్ఠురంగా చెలాయించుతూ ఆటోపోజ్వలులై సంచరించుతున్నారు. ఈ గొప్పవారూ, కొలదిగల

అనువాదం: తెన్నేటి సూరి

లక్షోపలక్షల యితర ప్రముక్కడి జీవులూ—ఈ గాథలోని వ్యక్తులు సహా తతిమ్మా ప్రాణులూ, ఎవరికి వారు తమతమ పాదాల ముందు పరచుకొనివున్న బాటలవెంట ఎవరి మార్గాన వారు యీ విధంగా సాగిపోతున్నారు.

## 2

1775 వ సంవత్సరం, నవంబరు నెల చివరిరోజుల్లో, ఒక శుక్రవారంరాత్రి, చాలా ప్రొద్దుపోయిన వేళ, ఈ గాథతో సంబంధంవున్న మొట్టమొదటి వ్యక్తి, డోవర్ రోడ్డు వెంట తలవంచుకుని నడిచిపోతున్నాడు. డోవర్ మెయిల్ కోచ్ 'షూటర్సుహిల్' కొండగుట్టమీదికి ఒడిదుడుకుగా ఎక్కుతోంది. కోచికి ప్రక్కగా, తక్కిన ప్రయాణీకులతో పాటు, బురదచుబడి, సదమదమౌతూ, మన బాటసారి కూడా కొండమీదికి ఎక్కుతున్నాడు. ఆ గొడ్డుచలిలో ప్రయాణీకులు, అలా క్రిందికి దిగి నడవటం వ్యాయామం చెయ్యాలనే సర్దాతో గాదు. బాడీరోడ్డు, కొండమీదికి ఎగసెక్కటం, బరువుబండి—గుర్రాలు అప్పటికే మూడునాలుగుసార్లు మొరాయించి నిలబడి పోయినై. ఒక పర్యాయం, అసలు సాంతం తిరుగుబాటుచేసి, కోచ్‌ని తిరిగి బ్లాక్‌హీత్‌కు వెనక్కు యీడ్చుకుపోయే ఉద్దేశంతో, అమాంతం రోడ్డుకు అడ్డంగా యీడ్చేసినై కూడా. ఈ తిరుగుబాటు ప్రమాదాన్ని జరటనే గమనించి, కోచ్‌వాలా, కొరడాకు పనిచెప్పి వాటి ప్రయత్నం కొనసాగకుండా చేశాడుగాని, అవి విజయంపొందినట్టయితే, జంతువులకుకూడా కొన్నిటికి యోజన శక్తివుందనే వాదాన్ని మనం అంగీకరించవలసివచ్చేది. ఆ కొరడా చరుపులతో గుర్రాలు ఓటమిని అంగీకరించి లొంగిపోయి, యధాపూర్వంగా తమ బాధ్యతను తాము నిర్వహించటానికి పూనుకున్నయ్.

తలలు వ్రేలాడబడిపోతున్నయ్; తోకలు గజగజావొణుకుతున్నయ్. ఆ రొంపిని బడి కోచ్‌ని యీడవలేక వాటిప్రాణాలు కడ ఒట్టి పోతున్నయ్. ఎక్కడి కీళ్లక్కడ సడలిపోతున్నట్టు ఉండుండి ముందుకు కుదబడి పోతున్నయ్. అలాంటి ప్రమాదం జరిగినప్పుడల్లా కోచ్‌వాలా కొంచెం తమాయించి 'ఓహోహో! అంటూ కళ్లాలు వెనక్కులాగి, ఆపి, వాటిని కాస్త లేచి తేరుకోనిస్తున్నాడు. అలా ఆపినప్పుడల్లా మొమ్మొనలో నడుస్తున్న నాయకాశ్వం, తలా, జూలూ కచ్చెగా విదిలించి 'ఈబండి కొండమీదికి జేరటం అసంభవం' అనే అభిప్రాయాన్ని విస్పష్టంగా ప్రకటించుతోంది. ఆ గుర్రం మెడపూసలు గలగల లాడినప్పుడల్లా మన బాటసారి మనసులో యేదో మథనపడుతున్నవాడులా కంగారుగా తలెత్తి చూస్తున్నాడు.

పొగమంచు దట్టంగా బట్టి పెద్ద పెనుభూతంలా కొండమీదికి వ్యాపించుతోంది. కన్నూకన్నూ పొడుచుకున్నా కనపించటంలేదు. కోచ్‌లైట్లు ఎందుకూ కొరగాకుండా వున్నయ్. గుర్రాలముందు రోడ్డు నాలుగుబారల దూరమైనా కనుపించటంలేదు. ఆయాసం పట్టలేక, గుర్రాలు, మంచులోకి ఆవిర్లు విడుస్తుంటే, ఆ పొగ మంచునంతా సృష్టించుతున్నది గుర్రాలేనేమోననే భ్రమ కలుగుతోంది. మన బాటసారితోపాటు, మరొక యిద్దరు ప్రయాణీకులు కోచ్‌ని అంటిపెట్టుకునడుస్తూ, కొండమీదికెక్కుతున్నారు. ముగ్గురూకూడా, చలిగాలి సోకకుండా ఆపాదమస్తకం దుస్తులు వేసుకున్నారు. మోకాళ్ళవరకూ 'జాక్ బూట్లు' తొడుక్కున్నారు. చెవులమీదకూడా మఫ్లర్లు కప్పుకున్నారు. ఒకరినొకరు చూస్తున్నారన్నమాటేగాని ఎవరే పోలికమనిషో రెండోవాడికి అంతుచిక్కకుండా వుంది. మనుషుల శరీరాల పోలికలేగాదు, మనసులు అంతకంటే అంతుచిక్కటంలేదు. ఆ రోజుల్లో ప్రయాణీకులు, త్వరగా ఒకరితో ఒకరు పరిచయాలకు దిగటానికి జంకేవాళ్ళు. అవును మరి—రోడ్డుమీద తారసిల్లే

మనుష్యుల్లో యే మనిషైనా దోపిడిగాడు కావచ్చు; లేదా, ఏ దోపిడి ముఠాలోనైనా షరీకైవున్నవాడైనా కావచ్చు. షరీక్‌దార్ల కేమిటి. ఏ దారి మకాంలో చూసినా వాళ్లే, ఏ సారాదుకాణంలో చూసినా వాళ్లే. హోటలుయజమానిదగ్గరనుంచి గుర్రాల శాల నౌకరుదాకా ఎవడైనా అలాంటివాడై వుండొచ్చు; ఎవణ్ణి నమ్మటం? ఆ సమయంలో, మెయిల్‌గార్డు కోచ్ వెనక తన కోసం అమర్చివున్న బల్ల చెక్కమీద నిల్చుని, సరీగా ఇవే మాటలు అనుకుంటున్నాడు. అతని చేతిప్రక్కను అమర్చిఉన్న కొయ్య పెట్టెమీద, ఒక పెద్ద నాటుతుపాకీ, మందు దట్టించి సిద్ధంగా వుంది. ఆ పెట్టెకు అడుగు ప్రక్కనున్న సొరుగులో ఒక పటాకత్తీ, తూటాలునింపిన ఏడెనిమిది పిస్టళ్లూ గుట్టబడివున్నయ్. ఆపెట్టెమీదికి ఆనుకుని ఎలాంటిప్రమాదం వచ్చినా ఎదుర్కోవటానికి సిద్ధంగావున్నాడు.

మెయిల్‌గార్డు ప్రయాణీకుల్ని అనుమానిస్తున్నాడు; ప్రయాణీకులు ఒకరి నొకరు అనుమానిస్తున్నారు. గార్డును కూడా అనుమానంగానే చూస్తున్నారు. అందరూ అందర్నీ అనుమానిస్తున్నారు. కోచ్‌వాలాకు గుర్రాల విషయంలో తప్ప ఇకెవ్వరి విషయంలోనూ, ఎలాటి విశ్వాసమూ లేదు ఆగుర్రాలు ప్రయాణం చెయ్యటానికి పనికిరాని స్థితికి వచ్చేశాయనే విషయాన్ని బైబిలు ముట్టిప్రమాణంచేసి చెప్పగల పరమవిశ్వాసంలోవున్నాడు.

'హాయ్! చల్!—ఏది ఇంకొక్క ఊపు—కొండమీదికి జేరిపోతాం—చల్!' గుర్రాల్ని" కొరడాతో అదిలించాడు. 'ఇవాళ నా తాడు తెంచారులే!'—

'శో!'—

'ఆఁ!'—గార్డు సమాధాన మిచ్చాడు.

'టైమెంతైందీ?'

'పదకొండూ పదినిమిషాలు'

'అయ్యో బాబో! పదకొండు కూడా దాటిందీ—చల్!— గుర్రం వెన్నుమీద కొరడాచివళ్లు చెడేల్‌మని మోగినై. కోచ్ ముందుకు సాగింది. జాక్‌బూట్ల ప్రయాణీకులు ముగ్గురూ, బురద చిందగొట్టుకుంటూ, కోచ్‌తోపాటు దబదబా నడుస్తున్నారు. ముగ్గురూ కూడా కోచ్‌ని అంటిపెట్టుకుని నడుస్తున్నారు; అది ఆగితే ఆగుతున్నారు; కదిలితే కదులుతున్నారు. కర్మంజాలక వాళ్ళల్లో ఏ ఒక్కడేనా రెండోవాడితో: 'అలా కాస్త ముందు పోయి నడుద్దాం పదండి' అని గనక పొరపాటున అంటే ఆ మొదటివాడు, రెండోవాణ్ణి, దోపిడిగాడే నని రూఢిచేసి అమాంతం పిస్టలుతో పేల్చేసే మనస్థితిలో వున్నారు.

ఆ చివరి ఊపుతో కోచ్ కొండ మీదికి జేరింది. గుర్రాలు తాపీగా నిలబడి ఊపిరి విడుచుకుంటున్నయ్. కోచ్ మళ్ళీ కొండ మీది నుంచి క్రిందికి దిగటానికి చక్రాలు తిరగకుండా అంటగట్టాలి.

(47-వ పేజీ చూడండి)

# ముసలమ్మ శపథం

### "చ్యవన"

"ఆ అమ్మాయి నీదగ్గరనే కూర్చో కూడదూ?" అన్నది ఎదటి సీటులో కూర్చున్న ముసలమ్మ. సూర్యనారాయణకు అరికాలిమంట నెత్తికెక్కింది. అసలే అతనికి ఆడవాళ్లంటే, అదోరకం చిటకారం. అందులో యిప్పుడు పిలుచుకు పోతున్న అమ్మాయి తన కాలేజీ లెక్చరరు గారి కూతురు! సూర్యనారాయణా, లెక్చరరు ప్రకాశరావుగారూ కేవలం గురుశిష్యుల్లా కాకుండా, ఒకరినొకరు అర్థం చేసికొని ఆప్తులుగా ప్రవర్తించే మిత్రులు. తన చెల్లెలు మద్రాసులో వున్నదనీ, ఆమెకు సుస్తీగా వుండటంవల్ల తన కూతురును సహాయంకోరకు పంపవలసివచ్చిందనీ, తనే వెళ్లాలి అనుకుంటే యింట్లో పని వాడికి సుస్తీగా వున్నదనీ ప్రకాశరావు శిష్యుడితో వెళ్లబోసుకున్నాడు. ఇంతలో పోస్టుప్యూన్ సదరన్ రైల్వే సర్వీస్ కమిషన్ నుంచి వచ్చిన కవరు సూర్యనారాయణ కిచ్చాడు. నాలుగోరోజుకి మద్రాసులో ఇంటర్వ్యూకు రమ్మని అందులో వున్నది! మేస్టరు అప్పుడే మద్రాస్ ప్రయాణం సంగతి చెప్పడం, యింతలో యీ కవరు రావడం సూర్యనారాయణకు నవ్వు తెప్పించాయి. మౌనంగా ఆ కాగితం లెక్చరరు కిచ్చాడు. ప్రకాశరావుగారు ఆ కాగితం చూచి 'అయితే మా అమ్మాయిని నీవెంట పంపుతాను—నీకేమీ అభ్యంతరం లేకపోతే!' అన్నాడు. ఎటూ అనలేకా, ఇన్ని యిబ్బందులలోవున్న మాస్టరుకు యీ మాత్రం సహాయం చేయకపోతే ఎలాగా అనుకొని ఒప్పుకొన్నాడు సూర్యనారాయణ. ఆడవాళ్లంటే ఎందువల్లనో విపరీతంగా విడియపడేవాడైనా—'ఆ అమ్మాయిని మోసేపని వుండదుకదా - తనపాటికి తను రైల్లో కూర్చుంటుంది - ఫరవాలేదు.' అని మనసు దిట్టపరచుకొన్నాడు.

రైల్వేస్టేషనుకు ప్రకాశరావుగారువచ్చి సరళనూ సూర్యనారాయణనూ రైలు ఎక్కించారు. సూర్యనారాయణ రైలుపెట్టెలో ఒక మూల ఖాళీవుండటం గమనించి ఆ వైపు చూపగా సరళ అక్కడ కూర్చుంది. సూర్యనారాయణ గేటుదగ్గరేవున్న సీటులో కూర్చున్నాడు; రైలు కదులుతూ వుండగా ప్రకాశరావుగారు రెండు తెలుగు పుస్తకాలు యిచ్చి — 'యివి సరళకివ్వు కాలక్షేపానికి' అన్నారు. ఆ పుస్తకాలు ఆమెకు పంపుతుండగా ఎదటి సీటులో ముసలమ్మ అన్నది. - 'ఆ అమ్మాయీ - నీ దగ్గరనే కూర్చోకూడదూ' అని సూర్యనారాయణ కోపం దిగ్రమింగి ఊరుకున్నాడు.

సరళ కూర్చున్నచోట ఒక ప్రయాణీకుడు బీడీ ముట్ట వెలిగించి గుప్పు-గుప్పుమని పొగ వదులుతున్నాడు. ఎవరేమనగలరు, వ్యక్తిస్వాతంత్ర్యంవున్న యీ రోజుల్లో! సరళ ముక్కుకు పమిటకొంగు అడ్డంపెట్టుకు కూర్చొన్నది. ఈసారి ముసలమ్మ గట్టిగా – 'అమ్మాయ్! యిక్కడకు రా! యీ రోజుల్లో సిగ్గేమిట్రా!' అంటూ పిల్చింది - సరళను వచ్చి సూర్యనారాయణ ప్రక్క కూర్చోమని. సరళ అతని వైపు చూచింది. ఇతను వూరుకొనడం మర్యాదేనా! బసవన్నలాగా పైకీ క్రిందకూ తల వూపేడు. మెల్లిగా సరళ లేచివచ్చింది. సూర్యనారాయణ ప్రక్కన కూర్చొన్న పెద్దమనిషి యిది గమనించి తాను అవతల సీటులోకి పోతూ సరళకు సూర్యనారాయణ ప్రక్కస్థలం చూపేడు. 'నీకూ మీ మే కనబడ్డమా మహారాజా!' అనుకొన్నాడు సూర్యనారాయణ. ఇద్దరూ ప్రక్క ప్రక్కనే కూర్చొన్నా చెరోకవైపుకూ తిరిగి పుస్తకాలు చదువుకోవడం చూచి ఎదటిసీటు చివర కూర్చొన్న వృద్ధదంపతులు ముసిముసి నవ్వులు నవ్వుకొంటున్నారు. బాపట్ల స్టేషను వచ్చింది. ఆ వృద్ధదంపతులలో భార్య చెప్పడం—ముసలాయన మల్లెపూలు కొనడం, ఆమె అందులో కొన్ని తీసికొని కొన్ని ముసలాయన కిచ్చి ఏదో చెప్పడం- చూస్తూనే వున్నాడు సూర్యనారాయణ. సరళ కొనుక్కోవచ్చుననే అభిప్రాయం బుర్రకు తోచలేదు. ఆ ముసలాయన 'మిస్టర్' అని పిలిచేసరికి సూర్యనారాయణ పై ప్రాణం పైనే ఎగిరిపొయ్యే పర్యంతమయింది. ఆయన మళ్లీ పిలిచి ఆ పూలు యిచ్చి 'అమ్మాయి కివ్వు' అన్నాడు నవ్వుతూ. ఈ మర్యాదంతా సరళకేనా— లేక యిద్దరూ కలిసివుండడం వల్లనా అని అతని సందేహం. పైగా ఎన్నడు తను పూలు గాని—రిబ్బన్లు-పౌడర్లు వగైరా— అంటే ఆడపిల్లల ప్రత్యేకావసర వస్తువులు తాకి ఎరుగడు. అతని చెల్లెళ్లు ఎన్నడూ అలాంటివి తెచ్చిపెట్టమని అతడిని అడిగే వారూ కాదు. విధిలేక ఆ పూలు సరళ చేతిలో పోసి పుస్తకం చదువుతూ కూర్చున్నాడు. ఇంతలో ఒంగోలు స్టేషను వచ్చింది. ముసలాయన మరచెంబు తీసికొని దిగివెళ్లేడు. సరళ కూడా ఖాళీ మరచెంబు తీసికొని చేతిలో వుంచుకొంది. ఎదటిసీటు

ముసలామె అడిగింది. 'అమ్మాయీ! కాఫీ కావలిస్తే తెప్పించుకోరాదూ?' అని. సరళ సూర్యనారాయణ ప్రక్కనే చెంబు పెట్టి పూరుకొన్నది. 'దీని భావమేమి తిరుమలేశా!' అని సూర్యనారాయణ చూస్తుండగా, ఎదటిసీటు ముసలమ్మ 'అబ్బాయ్— మంచినీళ్ళు కావాలి గాబోలు - తీసుకురా!' అని హెచ్చరించింది. సరళ తల వంచుకుంటే సూరి చెంబుతీసికొని వెళ్ళి నీళ్ళు తెచ్చి ఆ అమ్మాయి కిస్తుండగానే కేక వినపడ్డది 'ఏరోవ్ సూరీ! ఎందాకా?' అని. గేటువైపు చూచేసరికి పాత స్నేహితుడు గోపాలరావు, డప్పా డవాలూ సర్దుకుంటున్నాడు.

'మద్రాస్‌రా! రైల్వే అపాయింట్‌మెంటుకు ఇంటర్వ్యూకు పోతున్నాను.'

'అయితే ఇంటర్వ్యూకి - సమేతంగా బయలుదేరావన్నమాట!'

సూరి గొంతులో వెలక్కాయ పడ్డట్లయింది. కాదని గట్టిగా చెప్తాడా - ఎదటి సీటులో ముసలమ్మ - సీటు చివరి వృద్ధదంపతులు, ఏమనుకుంటారో? పైగా - ప్రకాశరావుగారినే ఆడిపోసుకొంటారేమో 'ఆడపిల్లను పరాయివాడితో ఎలా పంపించా'రని. సూరి మెల్లగా లేచి గోపాలావు దగ్గరకుపోయి మెల్లగా చెప్పేడు - తన కింకా పెళ్ళికాలేదని-యీ అమ్మాయి తన లెక్చరరుగారి కుమార్తె - అనీ.

ఇంతలో ముసలమ్మ సరళను అడుగుతున్నది 'ఏమే అమ్మాయ్! మీ ఆయనకు ఏం వుద్యోగం?'......

మద్రాసేనా?

'ఆ'

'క్రొత్త సంసారమా - ఇదివరకూ అక్కడే వుంటున్నారా?'

సరళ ఏం జవాబుచెప్పాలి? 'ఆయన నా మొగుడుకాదు' అంటుందా - పరాయి మొగాడితో యింత ధైర్యంగా వస్తున్నదా అనుకొంటారు. 'నాకు పెళ్ళే కాలేదింకా' అంటుందా పదహారేళ్లు వచ్చినా యింకా పెళ్ళిచేయకుండా ఎట్లావుంచేడు తండ్రి అంటారు—ఇంతలో మళ్ళీ ప్రశ్న—

'మీ అత్తగారి దేవూరు?'

'గుంటూరు' అన్నది సరళ - యిక తెగించి జవాబు చెప్పదలుచుకొన్నట్లు.

'మీ మామగారేంచేస్తున్నారు?'

'ప్లీడరు'

'మీ అత్తగారెక్కడ వుంది?'

'అక్కడే'

'నీకు ఆడబిడ్డ లెంతమంది - మరదులెందరు?'

'ఆరుగురు ఆడబిడ్డలు - నలుగురు మరదులు'

'మీ ఆయన ఎన్నో ఆయన?'

'పెద్దాయన'

'ఆయన జీత మెంత?'

'వందాయాభై'

'ఎన్నాళ్ళయింది కాపరానికి వచ్చి నీవు?'

'ఇప్పుడే'

'అదీ! అందుకే అంత సిగ్గుపడుతున్నావు - మా కాలంలో పదేసరి - యిప్పుడు కూడా యీ సిగ్గేమిటి?'

...............

'మద్రాసులో వుండట మెక్కడ నీకు తెలుసా?'

'ఉహూ'

యీ ప్రశ్నలు - జవాబులు - విని గోపాలావు చిత్రబోయి సూరి మొగం ఎగాదిగా చూస్తూ అన్నాడు.

'ఏరా - ఎందుకురా - ఇన్ని అబద్ధాలు చెప్పేవు! పెళ్లికి పిలవలేదంటాననా?'

'ఏడిశావ్ - నా మాటలన్నీ నిజమే.'

'మరి ఆ మాటలు?'

సూర్యనారాయణ అవతలసీటులో [illegible]

(15-వ పేజీ చూడండి)



ఇద్దరూ చెరొకపక్కకీ తిరిగి కూచున్నారు. ముసలమ్మ వారిని చూసి ముసిముసినవ్వులు నవ్వుకొంది.

# పెళ్ళిపరీక్ష

**శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు**

> పై అధికారి సాధింపులు పడలేని గుమాస్తా, పిల్ల నివ్వాలను కొనే పెద్దమనిషి పరీక్షకి నిలవగలడా?

'తమరిని అయ్యగారు రమ్మంటున్నారండి.'

శేఖరం వ్రాస్తున్న కాగితం ముగించి, దాన్ని సరియైనచోట పెట్టి తల ఎత్తాడు. తన పని నిర్వర్తించుకుని వెళ్ళిపోయాడు అప్పన్న.

'ఈ రమ్మనడం గంటకి పదిసార్లలే ఉండే ఇవాళ!' అనుకున్నాడు గుమాస్తా శేఖరం. టి. యస్. ఓ. ఆనందరావు పంతులు చాలా మంచివాడని ప్రతీతి. అతని మంచితనం శేఖరానికి తెల్సును కూడా - బాగా. సామాన్య పరిస్థితుల్లో గుమాస్తాలని అల్లరిచేసే తరహా కాదు. ఎంతో అవసరం ఉంటేకాని గుమాస్తాని గదిలోకి పిలిపించుకోడు.

ఇన్నాళ్లనించీ ఈ పిలుపులు శేఖరానికి చాలా అలవాటు లేవు. కాని, నిన్నటినించీ మాత్రం ఆఫీసరు తనని పదేపదే గదికి పిలిపిస్తున్నాడు.

ఉదయం రెండుసార్లూ పిలవడం పెద్ద అవసరంకోసమేమీ కాదు. మొదటిసారి ఏదో డ్రాఫ్టింగ్ పొరపాటు చూపడానికీ, సరిపెట్టమని చెప్పడానికీని. ఆ విషయాలు మార్జిన్‌లో నోట్ చేస్తే చాలదూ? కాని, తనని ప్రత్యేకమూ పిలిపించి చెప్పాడు... 'ఈ డ్రాఫ్టు ఇలాగేనా రాయాలి? పనులు కాస్త ఆలోచించి చెయ్యవద్దూ?...'

రెండోసారి మరీ *Silly* గా ఉంది.

'కరెంటు రిటర్నులన్నీ వచ్చాయా?'

'వచ్చాయండి.'

'కన్సోలిడేట్ చేశావా?'

'చేశానండి.'

'ఫారాలు సిద్ధంగా ఉన్నాయా రిటర్న్ వెయ్యడానికి?'

'ఉన్నాయండి.'

'ఐతే, ఇంకా రిటర్న్ ఎందుకు తయారవలేదు?'

'అయిపోయిందండీ...మీ సంతకానికి పంపుతాను'

'కాస్త త్వరపడుతూ ఉండాలి శేఖరం, పనులలో. రిటర్నులు వెళ్ళకపోతే, చూశావ్, హెడ్ ఆఫీసునించి టెలిగ్రాము రిమైండర్లు - అయినా, ఆలస్యం ఎందుకవాలి?'

'రిటర్నులు సెంటర్లన్నిటినించీ నిన్ననే వచ్చాయండి...'

'ఆ సంగతి నాకు తెలీదూ?...సరే, అయినా నిన్ను నే నడగవలసిన అవసరం రాకూడదు...వెళ్ళి వేగం పూర్తిచెయ్యి. తొందరఅని కాదులే-శాంతంగా చెయ్యి.. అయినా...'

శేఖరం నవ్వుకున్నాడు ఆయన ఛాందసత్వానికి.

ఇప్పుడు మూడో పిలుపు...శేఖరం లేచి వెళ్ళాడు.

ఆనందరావు తలవంచుకుని ఏదో తీవ్రంగా రాసేస్తున్నాడు. శేఖరం రాకని ఆయన గమనించనేలేదు. నాలుగైదు నిమిషాలు శేఖరం అలాగే నిలుచబడ్డాడు.

ఇంతట్లో ఆయన తలఎత్తి, 'ఎంతసేపైవచ్చావ్?' అన్నాడు.

'ఇప్పుడేనండి...'

'ఏం వచ్చావ్?'

'పిలిచారుట?'

'ఓహో!...అదా? నిన్నేదో అడుగుదామనుకుంటున్నాను. అదేమిటంటే— నీకు షార్ట్ హేండ్ వచ్చునా?'

'రాదండి...టైపేకాని, షార్ట్ హేండ్ నేర్చుకోలేదు.'

'అరే...అమ్మాయిలుకూడా నేర్చుకొంటూన్న కాలంలో నువ్వు...సరే - ఏం చేస్తాం? మన కరెస్పాండెన్సుకి బాగుంటుంది; అనుకున్నాను. సరేలే. వెళ్ళు...'

శేఖరానికి కొంచెం చిరాకు వేసింది. ఈపాటి ప్రశ్నకోసం ఇంత ఉపోద్ఘాతమూ అంత ఉపసంహారమూ ఏమిటని. 'ముసలితనం వస్తూందిగా...ఛాందసత్వం పెరుతోంది' అనుకున్నాడు కొంతసేపటికి.

ఆనందరావుగారికి నలభై అయిదు సంవత్సరాలు తక్కువ ఉండవు. అందుచేత శేఖరం ఉద్దేశానికి కాస్త బలం వచ్చింది. కొంచెం నెరసిన జుత్తూ, నాతిస్థూలమైన కాయమూ, చక్కగా పెరిగిన పెద్ద మీసాలూ, గోల్డురిమ్ము సులోచనాలూ తెల్లని ధోవతిమీద తెల్లటి చొక్కా, ఆయన ఆకృతిని చాలా అభిమానయుతం చేస్తాయి. ప్రకాశవంతమైన కళ్ళూ, సుమారుగా ఎప్పుడూ ఉండే ముఖాన చిరునవ్వూ అతని నొక దయామయుడిగా తోపిస్తాయి.

శేఖరం తన సీటులో కూర్చుని ఆయన ఆకృతికీ తన విషయంలో ప్రవర్తనకీ వున్న వైరుధ్యాన్ని గురించి ఆలోచించుకుంటున్నాడు. ఏమైనాకాని, ఏదో అసామాన్య కారణం ఆయన ప్రవర్తనకి వెనుక ఉందా? లేక ఇది రానున్న వృద్ధాప్యానికీ, ఛాంద

సత్వానికీ, నాందీ మాత్రమా? బహుశా ఈ రోజుతో ఆయన తనకే తెలియకుండా ముసలితనపు పరిహద్దుల్లో కాలు పెడుతున్నాడు. ఆ ఫలితం మొదటిసారి తనమీద పడి ఉంటుంది!

ఒక్కసారి తన ఆలోచనలకి నవ్వుకుని గుమాస్తా శేఖరం కలం పుచ్చుకుని ఫారమ్స్ నింపడం మొదలుపెట్టాడు. గడియారం మూడు కొట్టింది.

అప్పన్నని పిలిచి, టీ తెప్పించుకుని తాగి మళ్లా పనిలో పడ్డాడు. అయిదయేక పోదామని లేచి, కాగితాలన్నీ సర్దుతూంటే, ఆనందరావుగారు మళ్లా పిలచారు...

చుట్టూ ఉన్న గుమాస్తాలంతా వెళ్లిపోతున్నారు. ఆనందరావుగారి హయాంలో గుమాస్తాలు అయిదు తరువాత ఆఫీసులో ఉండనక్కర్లేదు.

'రిటర్నులన్నీ వేశావా శేఖరం?'

'E. ఫారమ్, అరవై స్టాలుగూ తప్ప మిగిలినవి వేశానండి'

'ఇంటికి వెళ్లిపోతున్నావా?'

'మీ రుండమంటే.. '

ఆ మాట అందామని శేఖరం అనుకోలేదు. కాని, గుమాస్తాలో మూర్తీభవించిన బానిసత్వం అతనిచేత ఆ మాట ననిపించింది.

ఆనందరావుగారు కుర్చీలోంచి లేచి, 'సరే......వెళ్లు' అన్నారు. బ్రతికానురా అని శేఖరం ఇంటికి దారితీశాడు.

*   *   *

శేఖరం సామాన్య కుటుంబానికి చెందినవాడు. అన్న వెంకట్రావు ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడు ఎలిమెంటరీ బడిలో. ఇచ్చే అరవై అయిదు రూపాయలతో, పిల్లలు లేరు కనక నలుగురూ బ్రతికాం అనిపించుకుంటున్నారు. శేఖరాన్ని పెదతండ్రి పిల్లలు లేక అభిమానంతో ఇంటర్ దాకా చదివించాడు. అప్పటి కాయనకే శక్తిలేక, మానివేశాడు చదువు.

అన్నకి తోడైతే కాస్త సంసారం చక్క దిద్దుకోవచ్చునని, శేఖరం గుమాస్తాగా చేరాడు – సర్వీస్ కమిషన్ ప్యాసయి. నానా శ్రమలూ పడి తన డివిజన్‌లోనే వేయించుకుని, అన్నకి సహాయపడుతున్నాడు. ఇరవై రెండేళ్ల వయస్సు వచ్చినా, జీవితం అంటే బాగా అర్థంకాని అమాయకుడు.

ఆఫీసర్ గురించి ఆలోచించుకుంటూ పరధ్యానంగా ఇంటికి వచ్చి కుర్చీలో కూలబడ్డాడు. ఉదయం వెళ్లడమూ, ఇప్పుడు రావడమూను. ఇంకా, దురదృష్టం కొద్దీ శేఖరం మెదడు యంత్రం కాలేదు.

వదిన కాఫీ తెచ్చిఇస్తూ......'అలాగ ఉన్నావేం?' అన్నది.

'పని ఎక్కువ చేసి...' అని, కాఫీ తీసుకుని, 'అన్నయ్య రాలేదూ?' అన్నాడు.

'రారులే...ఇన్స్పెక్టరుగారి అమ్మాయికి ప్రయివేటు చెప్పమన్నారట. ఇవాళనించీ సాయంకాలం అక్కడ ఓ గంట పని.'

గ్లాసు తీసుకుని వదిన లోపలికి వెళ్ళిపోయింది. తల దువ్వుకుని కొంచెం విశ్రాంతి కోసం ఊళ్ళోకి బయలుదేరాడు శేఖరం.

ఆవేళ అతను చాలా అలసిపోయి ఉన్నాడు. తిన్నగా ఊరవతలికి పోయి, ఎండిపోయిన నది ఇసుకతిన్నెలలో నడిచి నడిచి, అలసిపోయి, మానవుల దృష్టికి అందకుండా ఒకదగ్గర ఏకాంతంగా నిర్మల వాతావరణంలో కూర్చున్నాడు.

ఆ అపూర్వ ఏకాంతం అతనిలోని వ్యక్తిత్వాన్ని బైటికి తీసుకునివచ్చింది. అతనేదో ఇంతకుముందెరుగని తేలికతనం పొందుతున్నాడు. దూరంగా కనిపిస్తోన్న కొండలూ, పచ్చగా చెట్లూ, ఎండిపోయిన నదీ, కనుచూపుమేర నిర్మానుష్యతా, శేఖరానికి మత్తు కలిగిస్తున్నాయి.

ఆఫీసూ, ఆఫీసరూ, ఇతరప్రపంచమూ, నెలకి డెబ్భై రూపాయలూ, వార్తాపత్రికలూ, అన్నీ ఏవో మూర్ఖత్వంగా అతనికి కనిపిస్తున్నాయి. ఒక్కసారి అతనికి హృదయమంతా తేలికపడింది. చాలాసేపక్కడ కూర్చుని తన ఆలోచనా ప్రవాహాన్ని అడ్డులేకుండా పోనిచ్చాడు...

హఠాత్తుగా అతనికి ఒక సందేహం వచ్చింది...'జీవితంలో నేను సాధించినదేమిటి? సాధించబోయే దేమిటి?' అని.

జవాబుకోసం తడుముకున్నాడు. ఏమీ దొరకలేదు. తినడం, తిరగడంతో పూర్వార్ధాలు గడిచాయి. ఇప్పుడు ఆఫీసర్ చెప్పిన పని చెయ్యడమూ, ఆ బానిసత్వానికి ఫలితంగా ప్రభుత్వం ఇచ్చే రూకలని తినడమూ – అతని దైనందిన జీవితభాగాలు. అవే అతని పరమార్థాలు.

'ఈ అంక ఎలాగ వచ్చింది?'

'ఈ రిటర్న్ ఇంత ఆలస్యం ఎందుకయింది?'

'ఆ డ్రాఫ్ట్ వ్రాశావా?'

'ఆ కాగితాలు ఇంకా సంతకానికి ఇవ్వలేదేం?'

ఇలాంటి ఇంకో కొన్ని ప్రశ్నలకి తల వంచుకొని సమాధానా లివ్వడం తన విధి. బజారులో రేవన్‌డిపో పెట్టి అమ్ముతోన్న వ్యాపారి, నిరక్షుకుక్షి అయినా, రాగానే ఆసనం ఇచ్చి ఆదరించే ఆఫీసర్, గుమాస్తా వచ్చి నిలబడితే 'ఎందుకు?' అని అడిగేసరికి, కాలం గడిచిపోతుంది.

ఈ రోజు, ఉదాహరణకి, తన పని ఎలాగ ఉంది ఆఫీసులో?

కాలింగ్ బెల్. 'వస్తున్నా బాబూ..!' అప్పన్న గొంతు.

'శేఖరాన్ని ఇలాగ రమ్మను' ఆఫీసరు.

'తమర్ని అయ్యగారు రమ్మంటున్నారండి!' అప్పన్న.

ఒకటి, రెండు—పది...ఎన్నిసార్లయినా లేచి, చేతిలో పని వదలి వెళ్ళాలిసిందే. మానవత్వాన్ని విస్మరించి అధికారం చెలాయిస్తోంటే, ఆత్మాభిమానాన్ని మరచి అణగి ఉండాల్సిందే...

శేఖరానికి ఏడుపు వస్తోంది. ఇంతకుముందతను ఇలాగ ఆత్మపరీక్ష చేసుకొనే అవకాశం కలుగలేదు. తన నిజస్థితి చూసుకుంటే ఇలాగ ఉంది...

వెన్నెల పూర్తిగా వచ్చింది. అర్థవ్యథిత హృదయంతో శేఖరం ఇంటికి మరలాడు.

*   *   *

మరునాడు మామూలుగా గడిచిపోతుందనే ఆశ లేదు శేఖరానికి...ఏ నిమిషంలో ఆఫీసరుమీద తిరుగుబాటు చేస్తానో అని అతన్నొక అనుమానం పీడిస్తోంది.





ఉదయం పది అయేసరికి వెళ్లి తన సీటులో కూర్చున్నాడు. ఆరోజు ఆనందరావు కేంపు పోయాడని తెలియడం అతనికి చాలా సంతృప్తిని కలిగించింది.

అంకెలు కాలమ్స్‌లో వేస్తూ, సరిచూస్తూ, కలుపుతూ, పని చేస్తున్నాడు శేఖరం. ఆ రిటర్న్ అయిపోతే ఇంక అర్జెంట్ రిటర్న్లన్నీ సిద్ధం అయినట్లే.

రెండయింది. చెయ్యవలసిన రిటర్న్లన్నీ పూర్తయాయి. ఇంక డ్రాఫ్టులు రాయాలి. కాస్త కాఫీ త్రాగివస్తే?

అతనికి అడ్డేమీ కనిపించలేదు. వెళ్లాడు.

హొటలులో ఎవరో స్నేహితులు కనిపించారు. వాళ్ళతో మాటలాడి తిరిగి వచ్చేసరికి మూడయింది.

ఆ వేళ అయిదూ అయేసరికి ఒక్క పేజీ మాత్రం వ్రాశాడు...ఇంకా ఒక్క డ్రాఫ్టుకూడా పూర్తి అవలేదు.

ఇంటికి వెళ్దామని లేచాడు. ఆ వేళ అతనికున్న స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛా అతనికి మత్తు కలిగించాయి. మరునాడు ఆనందరావువస్తే ఈ స్వేచ్ఛ లేకుండా ఎలాగ ఉంటుందో ఆలోచనా మాత్రంగా కూడా అతని మనస్సు వికలత పెడుతోంది.

ఆ సాయంత్రం అతను మళ్ళా ఏకాంత స్థలానికి పోయి కొన్ని నిముషాలు గడిపాడు...పూర్తి సెలవురోజులాగ ఉందతని కారోజు.

మరునాడు ఆఫీసులో డి. యస్. ఓ ప్రత్యక్ష్యం అయ్యాడు. మళ్లా పిలుపులు..

'నిన్నటి పని బకాయి ఎందుకుంది? ఒక్క జవాబుకూడా డ్రాఫ్టు చెయ్యలేదు. ఆడుకుంటున్నావా?'

శేఖరం తెల్లబోయాడు...నిన్న తాను అనుభవించిన స్వేచ్ఛకి వడ్డీతో చీవాట్లు తగులుతూన్నట్లుంది.

'నిన్న కొంచెం ఒంట్లో బాగులేక చెయ్యలేకపోయానండి. ఇవేళ పూర్తి చేస్తాను.'

'ఇవాళ చెయ్యవలసినవి? - రేపటికి వాయిదా వేస్తావు కుర్రవాళ్లకి ఉద్యోగాలిచ్చి భరించడమే కష్టమోయ్. పోనీ, ఉపకారం చేద్దామని నీకు ఇక్కడ ఉద్యోగం ఇచ్చాను. నా పనికి లోపం చేసి—'

'ఇవేళ ఎలాగైనా పూర్తిచేస్తానండి'— శేఖరం మనసు చాలా బాధపడుతోంది. ఒక్కసారి తిరగబడదామని ఉందతనికి. కాని...

'సరే – కాని, పని విషయంలో ఇంకా జాగ్రత్తగా ఉండాలి'

'సరేనండి'

అతను నీరసంగా సీటు దగ్గరకి కదిలి, కలం తీశాడు. చాలా తొందరగా రాస్తున్నాడు.

రెండయేసరికి బకాయిపని చాలావరకు పూర్తయింది. కలం క్రిందపెట్టి కొంచెం విశ్రాంతి తీసుకుని, అప్పన్నని టీకి పంపాడు. ఇంతటిలో ఆనందరావు అతని సీటుదగ్గరికి వచ్చాడు.

స్ప్రింగులాగ లేచి నిలబడ్డాడు శేఖరం.

'ఎంతవరకూ అయింది?'

'ఇంక ఒక్కటి రాస్తే నిన్నటి పని పూర్తవుతుందండి'

ఆనందరావు డ్రాఫ్టులని తీసిచూశారు. అతని ముఖంలో కొంచెం సంతృప్తి కనిపించింది.

'నాకు తెలుసునోయ్ నువ్వు పని చెయ్యగలవని. బద్ధకం అన్నది ఉందే మహా దరిద్రం అనుకో...ఎంత వడలువంచి పనిచేస్తే అంత ఫలితం. సరే...కానీ'

ఆయన వెళ్లిపోయాడు. ఆ ఆగమనం ఎందుకో శేఖరానికేమీ అర్థంకాలేదు. టీ తాగి మళ్లీ కలం తీశాడు.

అయిదు కొట్టేసరికి రెండు రోజుల పనీ పూర్తిచేసి వేళ్లు విరుచుకుని, సంతృప్తిగా ఆఫీసర్ గదిలోకి నడిచాడు శేఖరం. అక్కడా, అక్కడా కొన్ని లోపాలని చూపినా, మొత్తంమీద చాలా అసంతృప్తిని వెలిబుచ్చలేదు ఆఫీసర్. వాటిని ఫెయిర్ కాపీయింగ్‌కి ఇస్తూంటే టెలిగ్రాం బంట్రోతు వచ్చాడు. శేఖరం గుండె జల్లుమన్నది.

ఏ వికారమూ లేకుండా, ఆఫీసర్ టెలిగ్రాం తీసుకుని చదివి, శేఖరాన్ని చదవమని ఇచ్చాడు...అది డి. యస్. ఓ నించి ఏదో రిపోర్టు తిరుగు టపాలో పంపమని.

'ఏంచేద్దాం?' - ఆఫీసర్.

శేఖరం తెల్లబోయాడు...'మీ ఇష్టం'

'రాత్రి కాస్త ఇంటికిరా ... డిక్టేట్ చేస్తాను. టైప్ చేద్దూగాని. భోజనం చెయ్యగానే రా.'

రెండో గుమాస్తా శేషగిరిని రమ్మన కూడదా అనుకున్నాడు ఆమాటే అడుగుదామనుకున్నాడు...కాని, గుమాస్తా - ఆఫీసరుని ఎలాగ అడుగుతాడు?

'అలాగేనండి' అన్నాడు హతాశుడై. ఆనందరావుమీదమాత్రం చాలా కోపం వచ్చింది. ఏమాత్రం ధనం ఉన్నా, ఈ దరిద్రపు ఉద్యోగాన్ని తక్షణం వదలి వేరే ఏమిటి చెయ్యగలిగినా ఎంత నయం! పగల్లా, గౌరవంలేని పరిసరాలలో విశ్రాంతి లేకుండా, వ్రాత పరికరంతో తానొక పరికరమై పనిచెయ్యడం...ఈరోజు రాత్రి కూడా విశ్రాంతి లేకుండా అతని ఇంటికి వెళ్ళి పనిచెయ్యాలి! గుమాస్తా!

'ఎనిమిదికి వస్తానండి.'

నీరసంగా బయటికి నడిచాడు.

* * *

రాత్రి ఎనిమిదయేసరికి ఆనందరావు గదిలో కూర్చుని శేఖరం ఆయన చెప్పేదంతా టైప్ చేస్తున్నాడు. డి. యస్. ఓ కి ఇచ్చే రిపోర్టులో స్వంత లోపాలని కప్పిపుచ్చుకుందుకు ఆయన పడే పాట్లూ, అధికారుల అంతర్విషయాలూ గమనించి మధ్యన అతను నవ్వుకుంటూ పనిసాగిస్తున్నాడు. ఎప్పటికైనా ఈ పని పూర్తవుతుందా, హాయిగా తన ఇంట్లో పడుకుందామా అని అతని దృష్టి.

తొమ్మిదయేసరికి, డిక్టేషన్ ఆపి, ఆనంద

రావు 'శశీ' అని కేక వేశాడు. లోపలనించి 'ఎందుకండీ?' అని ప్రతిప్రశ్న.

'కాఫీ అయితే తీసుకురా అమ్మా'

శశి కాఫీ రెండు కప్పులతో తెచ్చి టేబిల్ మీద పెడుతోంటే శేఖరానికి చిన్న షాక్ కొట్టినట్లైంది.. బద్ధకం అంతా పోయి ఒక్కసారి మనసూ తానూ - ఏని మేట్ అయ్యారు

కాఫీ పూర్తిచేశాక, శశిమళ్లీ వచ్చి కప్పులు తీసుకుని వెళ్లిపోయింది. 'ఎంత సౌందర్యం!' అనుకుని, శేఖరం మళ్ళా కష్టంగా పనిలోకి మనస్సుని త్రోశాడు.

రాత్రి ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు అతను గుమ్మం దాటేదాకా చాలాసార్లు వెనుదిరిగి చూస్తూనే ఉన్నాడు.

* * *

రాత్రి పదిన్నర అయింది శేఖరం ఇంట్లోకి వచ్చేసరికి. ఆలశ్యంగా వచ్చి అందరినీ లేపడం ఎందుకని అతను తిన్నగా గదిలోకి పోయి పడుకున్నాడు. అన్నా, వదినా ఏవో మాట్లాడుకుంటు న్నారు.

'—ఆ చీర ఇప్పుడెందుకూ? అప్పుడు అవసరంకొద్దీ చెప్పాను కావాలని. దగ్గర డబ్బు సిద్ధంగాలేదు. ఊరుకున్నారు. మరదికి సరియైన బట్టలు లేవు. పాపం, ఆఫీసులో ఎలాగ మసులు తాడు? అన్నీ అయేక చూసుకోవచ్చును లెండి'

'కొంచెం లోను తీసుకుంటానులే... నిజమే వాడికి బట్టలులేవు. ఎందుకని అడగలేదు. వాడి జీతమూ మనం చేసిన అప్పులు పూడ్చడానికే వాడుతున్నాము. ఈ నెల వాడిజీతం వాడి బట్టలకే వదిలేస్తే సరి'

శేఖరం గుండె జల్లుమన్నది. ఇంట్లో ఇంత క్లుప్తంగా చేసి, శ్రమపడుతున్నారని అతనికి తెలీదు.

'అదీకాక - ఇంక అతని పెళ్లిమాట చూడకపోతే ఎలాగ? దానికీ డబ్బు కావాలి. కానియ్యండి...ఎలాగో చేద్దాం. మన ప్రయత్నంమీద మనం ఉండాలిగా?,

శశిరేఖా, టైపురైటరూ, కాఫీ కప్పూ, శేఖరానికి ఒక్కసారి జ్ఞప్తికి వచ్చాయి.

కాని, తనకీ, శశిరేఖకీ మధ్యన చాలా అంతస్థు లున్నాయి.

తాను, ఆపూట భత్యంకోసం బ్రతుకు తోన్న గుమాస్తా...వెనక సెంటున్నర భూమిలేని పేదవాడు.

ఆయన పూర్వావతారం గుమాస్తా అయి ఉండవచ్చు. కాని ఇప్పుడాయన ఆఫీసర్.. ఇరవైవేలు రొఖ్ఖమూ, వెనకాల భూములూ అవీ ఉన్న ధనవంతుడు.

కాని, ఏదైనా అదృష్టంకొద్దీ...

తన మూర్ఖత్వానికి తానే నవ్వుకొని, కళ్లు మూశాడు శేఖరం. తెల్లవార్లూ అతను కలలు కంటున్నాడు.

మరునాడు మామూలుగా ఆఫీసుకి వెళ్లే సరికి రాత్రి ఆలోచనలన్నీ మరలివచ్చాయి. ఆనందరావు అంటే అతనికి ఈర్ష్యా కోపమూ నెమ్మదిగా ప్రారంభిస్తున్నాయి. తాను వాళ్లందరికీ ఎన్నోమెట్లు క్రిందకి ఉన్నాననే భావం అతనిలో తీవ్ర భావా లని కలిగిస్తున్నాయి.

విద్యార్థిగా ఉండేటప్పుడు నాటకా లలో శేఖరానికి ఆఫీసరు పాత్రలూ, యువరాజుల పాత్రలూ ఇచ్చేవారు. చిన్నప్పుడు తన జాతకం చూసి, తనకి రాజయోగం ఉందని చెప్పే రుట. అది నిజమే అయి, ఆ దశ అంతమూ అయి, ఈనాటికి తిరిగి గుమాస్తాగిరికి దిగ జారేడు!

ఒక్కసారి ముందరి పిజియన్ పోల్సూ, ఫైళ్లూ, పేడ్లూ, ట్రేలూ అతన్ని సత్యం లోకి లాగుకొని వచ్చాయి. కలం తీశాడు.

కాని, కలం సాగడంలేదు. పేదరి కమూ, ఆత్మలని చంపుకున్న గుమాస్తాల నైచ్యమూ, తన జీవితమూ, శశిరేఖకీ తనకీ మధ్య దూరమూ ఇవన్నీ అతని మనస్సుని క్షోభింపజేస్తున్నాయి.

కాలింగ్ బెల్.

'చిత్తం బాబూ!'

'శేఖరాన్ని పిలూ!'

అప్పన్న వచ్చి ఆఫీసర్ ఆజ్ఞని చెప్ప

చెప్పాడు. శేఖరం కుర్చీలోంచి లేవలేదు. ఆఫీసర్ తనని అవమానిస్తున్నట్లు భావించాడు. ఈ పని చాలా చిన్నదయినా ఉన్నా, స్లిప్ రాయక, తన కెందుకు రమ్మనాలి?

కాని, అంతరంగం అతనికి పిరికిమందు పోస్తోంది. ఆయన కెందుకు కోపం తెప్పించాలి? ఏదో పెద్దవాడు...ఏమైనా, ఆఫీసరు—

అతని దౌర్బల్యం అతన్ని జయించింది. లేచి ఆఫీసర్ గదిలోకి వెళ్ళాడు. ఆయన కొంచెం కోపంగా చూసి' 'ఈ డ్రాఫ్టేమిటి?' అన్నాడు.

శేఖరం తెల్లబోయాడు. దానినిండా చాలా తప్పులు మార్కు చేశాడు.

'ఇలాగేనా డ్రాఫ్టు చెయ్యడం?'

గుమాస్తాకి కోపం పాదరసంలాగ ప్రాకుతోంది. పరిస్థితులు అతనినిపట్టి అపుతున్నాయి. అతను మౌనంగా ఊరుకున్నాడు.

'కొంచెం కళ్లు ఉపయోగించు. వెళ్లు'

కష్టంగా వెనుదిరిగాడు ఆఫీసర్ గదినించి శేఖరం. అడుగడుగునా అతనిగుండె బరువెక్కుతూంది. ఎంత నికృష్టమైనది, తన జీవనం!

కాగితంమీద కలం పెట్టలేకపోయాడు. కళ్లు ఉపయోగించాలి! ఎంత అధికారం! ఇంతకన్న బడిపంతులు ఉద్యోగం ఎంత నయం! గౌరవం ఇచ్చి గౌరవం పుచ్చుకోవడమైనా వాళ్లకి తెలుస్తుంది!

గడియారం తిరుగుతోంది. అతని మనస్సులో ఆలోచనలు వందలు వేలయ్యాయి.

రెండు కొట్టింది.

మళ్లా కాలింగ్ బెల్. కొంచెం సేపట్లో అప్పన్న పిలుపు.

పల్ఫులోనించి తెల్లకాగితం తీశాడు శేఖరం. ఉద్రేకాన్ని అణచుకుని, వ్రాశాడు:

'గౌరవం ఇచ్చి, గుమాస్తాలనికూడా మనుష్యులుగా, పరిస్థితులకి లొంగిన అభాగ్యులుగా, గుర్తించలేని మీ ప్రవర్తనకి అసమ్మతిసూచకంగా నా రెజిగ్నేషన్ దాఖలు చేస్తున్నాను.

మన మందరమూ, ముందర మానవులం. తరువాత ఉద్యోగులమూను. కేవలం మీ పదవి మిమ్మల్ని మానవాతీతులుగా చేస్తే చాలా విచారించవలసిన పొరబాటుని మీరు నిజం అనుకుంటున్నారు.

మీలాగే మాకూ సంసారాలూ, గౌరవించేవారూ, అన్నీ ఉన్నాయి. ఈ విషయం మీ రెంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది. దయఉంచి నా రెజిగ్నేషన్ని అంగీకరించండి...'

కాని, మళ్లా తొందరపడడం ఎందుకని, శేఖరం ఉత్తరాన్ని జేబులో పెట్టాడు. ఆఫీసర్ గదిలోకి వెళ్లాడు.

'రావడం ఇంత ఆలస్య మేం?'

'పనిలో ఉన్నాను'

'ఇంకా ఆరిటర్న్ పూర్తి కాలేదా?'

'లేదు'

'కారణం?'

'కొంత అయింది'

'మిగిలినది?'

'అవుతుంది'

'ప్రొద్దుటనించీ నిద్రపోతున్నావా?'

'ఇది ఆఫీసని తెల్సును'

'మరి?'

'ఒంట్లో బాగులేక'

'చాల్లే వేషాలు.. తల తిరుగుతోందా, అలాగ జవాబిస్తావ్?'

'మీరు కొంచెం గౌరవంగా మాటలాడతారా?'

'ను వ్వెవరితో మాట్లాడుతున్నావో తెలుసా?'

'తెల్సును. ఇంకొక మనిషితో'

'కళ్లు కనిపిస్తే ఇంకొంచెం గౌరవంగా మాట్లాడుతావ్'

'మరోసారి చెప్తున్నాను. గౌరవంగా మాట్లాడండి'

'అబ్బా! గౌరవం! పెద్ద మాటలు వచ్చాయే!'

'మానవత్వంలో నమ్మకంఉంటే అది చిన్నపిల్లలకి తెలిసేమాట.'

'కవిత్వం కట్టిపెట్టి అవతలకి పో!'

"నోరు మూసుకుని, కూర్చోండి. ఈ ఉత్తరంతీసుకొని, ఈసారి మీరు మీహాహుకార్లకిచ్చే గౌరవంతో నన్ను చూడకపోతే ఎలాంటి ఫలితాలు వస్తాయో ఆలోచించుకోండి ఇంక మాటలు మీరారా, జాగ్రత్త, సెలవు."

శేఖరం వెనుదిరిగి వెళ్లిపోతున్నాడు. ఆనందరావు ఒక్కసారి 'శేఖరం?' అని అరిచాడు. వినిపించుకోకుండానే శేఖరం ఇంటికి దారితీశాడు.

* * *

శేఖరం తిన్నగా ఇంటికి వచ్చాడు. ఉద్రేకంతో అతని రక్తనాళాలన్నీ తీవ్రంగా పనిచేస్తున్నాయి.

'ఏం ఇంత తొందరగా వచ్చేశావ్?' అంది వదిన.

'ఉద్యోగానికి రెజిగ్నేషన్ ఇచ్చాను.'

ఆమె తెల్లబోయింది.

'ఏమిటండి, శేఖరం! హాస్యమాడుతున్నావా?'

'లేదు వదినా. పశువులాగ చూసేవాళ్ల దగ్గర ఏంపని చెయ్యమంటావు? మాటలు మీరాడు టి. యస్. ఓ. చాలాకాలం ఓర్చాను. ఇంక భరించలేకపోయాను.'

'తొందరపడ్డావు శేఖరం. ఈ ఊళ్లో నిన్ను వేయించినదే ఆయనగా? పెద్దవాళ్ల మీద అంత వేగంగా తిరగబడతారా?'

శేఖరం తలవంచుకున్నాడు.

'సరిలే. ఏదో అయింది. బతకలేకపోము. బెంగపెట్టుకోకు'

వదిన శేఖరాన్ని ఆలోచనలో పడవేసింది. ఆనందరావు మంచి స్వభావమూ, మొదట తానా ఊళ్ళో ఉద్యోగం తెచ్చుకోడాని కతని సహాయమూ, తనగృహంలో పరిస్థితి అన్నీ అతన్ని ఆలోచింపజేశాయి.

ఈ ఉద్యోగం పోతే, అన్నయ్య ఎంత కష్టపడాలి మళ్లా? ఆనందరావుకి క్షమాపణ చెప్తే?

ఛీ...అంతకంటే నీచం ఏమిటుంది? ఒకసారి తన గౌరవం అలాగ పోగొట్టుకుంటే జన్మలో ఇక తల ఎత్తక్కర్లేదు.

'వెంకట్రావు అంతా విన్నాడు' కొంచెం తొందరపడ్డావేమో సరేలే. ఏదో అయిందిగా. చూద్దాం...అని మాత్రం అన్నాడు.

కాని శేఖరం చాలా విచారించాడు తన తొందరపాటుకి. రాజీనామా ఇవ్వకుండా ఉంటే చాలా బాగుండు ననుకున్నాడు. అన్నా, వదినా ఏమీ అనలేకనే ఇలాగ ఊరుకున్నారని అతనికి తెలుసును

రాత్రి భోజనాలుచేసి, ముగ్గురూ వరండాలో కూర్చుని ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఆనాటి ప్రసక్తి రాకుండానే సంభాషణ సాగిపోతోంది బైట "శేఖరం!" అని కేక వినిపించింది. తొందరగా వెళ్లి తలుపు తీశాడు శేఖరం. ఆనందరావుగారు నవ్వుతూ లోపలికి వచ్చారు.

అంతా తెల్లబోయారు.

'నమస్కారం పంతులుగారూ' అని, వెంకట్రావు ఆయనను లోపలికి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. శేఖరం చాలా సిగ్గుపడుతున్నాడు; ఆ క్షణంలో ఆయన చాలా హృదయ వైశాల్యం ప్రదర్శించాడని గ్రహించి.

'మీ రిలాగ దయచెయ్యడం చాలా...'

ఏమనాలో తెయలిక ఆగాడు వెంకట్రావు.

'విశేష మేమీలేదులెండి... మీ శేఖరానికి ఇవాళ నామీద చాలా కోపం వచ్చింది. మరి, నేనూ తొందరపడితే ఎలాగ?' ఆనందరావుగారు నవ్వుతున్నారు. అక్కడ అందరూ చిరునవ్వుతోనే కనిపిస్తున్నారు.

'*Iam Sorry.* ఉద్రేకానికి తట్టుకో

లేక పోయాను. క్షమించండి' అన్నాడు శేఖరం.

'అదేమీ అక్కరలేదులే. నువ్వలాగ ఉద్రేకానికి తట్టుకుంటే పెళ్ళి అవి ఎలాగ అవుతాయ్?'

అందరూ తెల్లబోయారు.

'అసలు శేఖరాన్ని ప్రత్యేకంగా రాసి రంపాన పెట్టాను వెంకట్రావుగారూ. అతనికి కోపం వస్తే తప్పేముంది?'

'అతని ఓర్పుని పరీక్ష చేశాను. చూశారూ, కొత్త ఆత్మగౌరవం ఉన్న మనిషి ఎక్కడ దెబ్బతింటాడో అక్కడ దాకా చూశాను. సరిగ్గా పలికాడు. తన గౌరవం నిలబెట్టుకోడానికి ఉద్యోగానికి రిజిగ్నేషన్ ఇచ్చాడు.

'మనిషిలో ముఖ్యమైనది ఆత్మగౌరవమే కాదూ, వెంకట్రావుగారూ? సమర్థత ఉంది, చివరంత వరకూ పోట్లాడని స్వభావం ఉంది. అవసరం వస్తే ఏమైనా చేసి ఆత్మగౌరవం నిలబెట్టుకొనే పౌరుషం ఉంది... అస్తు లెందుకండీ ఇంక?'

అందరూ వింటున్నారు. ఆనందరావు ఎత్తిపొడుపుకే ఇలాగ అంటున్నాడో, ఆయన ఉద్దేశం ఏమిటో ఎవరికీ బోధపడక తెల్లబోయి ఆయన ముఖంలోకి చూస్తున్నారు.

'పోనీ అంటే ఆఫీసు దాటాక చూశారా ఎంతగా గౌరవించాడో! శేఖరం, నువ్వంటే నాకు చాలా మంచి అభిప్రాయం ఉందోయ్!'

ఆనందరావుగారు చాలా ఉల్లాసంగా కనిపిస్తున్నారు.

'సరే. దానికేంలెండి. మీ బుషులు ఎవరు?'

అర్థంకాక చూస్తూ వెంకట్రావు చెప్పాడు.

'బతికించారు. ఇంక అసలు విషయానికి వస్తాను. తిథీ, నక్షత్రం, అద్భుతంగా ఉన్నాయి. న వారదోషం. మీ అబ్బాయికి-అంటే మీ తమ్ముడికి మా అమ్మాయిని శేఖర్కి ఇస్తానని చెప్పడానికి వచ్చాను. అమ్మాయిని అబ్బాయి చూచాడు... మా తరఫు అంతా ఇష్టమే. ఇంక మీరున్నారు'

* * *

మరి కొంచెం రోజుల్లో శేఖరం పెళ్ళి అయిపోయింది. ఆశీర్వదిస్తోన్న వదినతో 'మావాడా వదినా, ఆరోజు తొందర పడ్డావన్నావు. ఆ తొందర లేకపోతే...' అన్నాడు శేఖరం.

'ఈ మనవి కాకపోను' అని పూర్తిచేసింది వదిన. ★

# ముసలమ్మ శపథం

(9-వ పేజీ తరువాయి)

వుండటం చూచి గోపాలావును పిలుచుకెళ్ళి విశదంగా చెప్పేడు. గోపాలావు ఇతమిద్ధమని తేల్చుకోలేకుండానే నెల్లూరులో దిగిపోయాడు.

రైలుఆగిన ప్రతిస్టేషనులోనూ ఎవరో ఒకరువచ్చి సరళప్రక్కన ఖాళీసీటులో కూర్చోబోవడం - ముసలమ్మ 'ఆ అమ్మాయి పెనిమిటి వస్తాడు' అని చెప్పి సాగనంపడం సూర్యనారాయణ గమనిస్తూనే వున్నాడు.

ఎలాగో మద్రాస్ చేరుకొనేసరికి సాయంత్రం అయింది. స్టేషను దగ్గరకు ప్రకాశరావుగారి బావ వేంకటేశ్వరరావు గారూ వచ్చారు. ఎదటిసీటు ముసలమ్మను చూసి - 'పిన్నీ - నీవూ యీ బండికే వచ్చావా' అంటూ ఆమెనూ దింపుకొన్నాడు. సూర్యనారాయణ సామానునూ ఆయన దించుకోవడం గమనించి, 'ఏరా-వెంకూ-యీ అమ్మాయి ఎవర్రా?' అన్నది ముసలమ్మ.

'మా బావమరది ప్రకాశరావు పెద్ద కూతురు.'

'పెళ్ళికాలేదు గాబోలునుగా?'

'అవును'

'మరి యీ అబ్బాయి ఎవరూ?-'

'ప్రకాశరావు దగ్గర చదువుకునే కుర్రవాడు. మనవాడే.'

'ఓసినీ కడుపు చల్లగుండా ఏమే పిల్లా-ఇందాకటినుంచి ఏమేమీ చెప్పితివిగదే!'

వెంకటేశ్వరరావు దిగాలుపడి సూర్యనారాయణవైపు చూచేడు.

'కాదు మామయ్యా - ప్రతివాళ్ళూ మమ్మల్ని అడగకుండానే మొగుడూ పెళ్ళాలక్రింద లెఖకట్టి మాట్లాడితే ఏం చెయ్యం? కాదని చెప్పినా వినేటట్లు లేరే?' అన్నది ధీమాగా సరళ.

సూర్యనారాయణ చేతిగుడ్డ అడ్డంపెట్టుకొని నవ్వేడు.

'ఓసి భడవా! ఏదో - కొత్త పెండ్లి కూతురువనీ - వీడో అన్నంగాని - అయినా...మీ యిద్దరికీ ముడిపెట్టించకపోతే నా పేరు పేరమ్మకాదు చూడు!' అని ముసలమ్మ శపథం పట్టింది.'

సూర్యనారాయణకు యిప్పటికీ అర్థమయింది కొత్తదంపతులకు యింత గౌరవం వుంటుంది గాబోలునని. నిజానికి సూర్యనారాయణ ఒక్కడే ప్రయాణంచేస్తే - రైల్లో నిలబడటానిక్కూడా వీలుండేది కాదు.

ఇంటికి వచ్చేసరికి వెంకటేశ్వరావుగారి భార్యకు పెద్దమ్మగా వున్నట్లు తెలిసింది. సూర్యనారాయణ ఇంటర్వ్యూకు వెళ్ళివచ్చేసరికి ముసలమ్మ ప్రకాశరావుగారికి జాబు వ్రాయిస్తున్నది - 'యీడూ జోడూ బాగావుంది - త్వరగా మూడు ముళ్ళూ వేయించేయ్' అని.

సూర్యనారాయణకూడా కళ్ళు మూసుకొని 'ముసలమ్మ శపథం నెగ్గించు మహాప్రభో!' అని పరాత్పరుడికి విన్నవించుకొన్నాడు.



# గోడలకి కళ్ళు

"ఏం చూస్తున్నావు అక్కయ్యా! నాకూ చూపెత్తవూ!" అన్నాడు ఓ ఆరేళ్ళ కుర్రాడు. తలుపు సందులోంచి ఆత్రుతగా చూస్తున్న కామాక్షి కొంగు లాగుతూ—

"ఇస్ వెధవా! తప్పు! నువ్వు చూడకూడదు! పోయి పడుకో!" అని కామాక్షి వాడికో మొట్టికాయపెట్టి తన ధ్యానంలో మునిగింది.

"ఒసే ఏమిటయిందే! నన్నో సారి చూడనీ, అంత యిదయిపోతున్నావేమిటి?" అంది లక్ష్మి పైకి వినబడకుండా—కామాక్షి మొహంమీద మొహం పెట్టి.

"అబ్బ! వుండవే ఛస్తున్నావేమిటీ! చూడనిస్తావా? ఏదీ"...అని కామాక్షి లక్ష్మిని తోసేస్తూ అంది.

"ఎంతసేపని చూస్తావు! నన్నో సారి చూడనీ."

"ఊఁ! ఆ పక్కనించి చూడవే నన్ను బాధపెట్టక."

ఇలా మొత్తంమీద కిసకిస లాడుకుంటూ కొంచం కాలంలోవున్న ఆడపిల్లలే... నలుగు రైదుగురు...ఆ ద్వారందగ్గిర మూగి నవ్వుకుంటో, గుసగుస లాడుకొంటో మహా 'ఇద'యి పోతున్నారు.

ఇంతలో ఓ వితంతువు వచ్చి.

"అయ్యొ! సింగారంవా? బావుందర్రా బావుంది, మీరూ మీ వాలకమూను, ఏమిటే చూస్తారు? అలా ఎగబడిపోయి; విరగబడిపోతూ? సిగ్గులేవూ? పొండి! బాగుపడ్డానికా? ఇలాటివే చెడిపోయే బుద్ధులు. కాలంవుండగా మీకేం తెగులర్రా! పొండి అవతలికి!- అవునే నాగులూ;

శ్రీ ద్వివేదుల సోమనాథశాస్త్రి

నువ్వూ వున్నావూ? పెళ్లికాని పిల్లవి. ఆ మాత్రం జ్ఞానం వుండొద్దూ! అయినా నిన్నని ఏంలాభం పెద్దవాళ్లు అదుపూ ఆజ్ఞా వుండాలిగాని. తప్పు! అవునా? ఉండు మీ అమ్మతో చెబుతాను. ఇప్పట్నుంచే యిలా అయితే ఆ తర్వాత అయినట్టే వెళ్లండి యిళ్లకి! అలా చూస్తారేం!"

అని కొంచం గద్దించి చెప్పేటప్పటికి, ఒక్కొక్కరూ అవతలకి తప్పుకున్నారు. యింతా చెప్పిన ఆవిడే సైనుపంచ చెవులకి తగిల్చి, తలుపు సందులోంచి చూడ్డం మొదలెట్టింది. యీమె వెనకాలే వెంకమ్మగారు కూడా వచ్చింది...

"అవునే వెంకమ్మా. ఎరుగున్నట్టు అంత చనువుగా పలకరిస్తున్నాడేమిటే!" అంది. సందులోంచి చూస్తూనే సుబ్బమ్మ.

"ఏమో మనకేం తెలుసు? పెళ్లయిం తర్వాత ఏడాది పూరికనే వున్నారుగా - ఆ లోపుని వాళ్ళేం మడిగట్టుకు కూర్చున్నారా? మాటాడుకొనే వుంటారు!"

"అయ్యొయ్యయ్యొయ్యొ...!"

ఇది వినగానే—

"ఏమిటే ... దొడ్డమ్మా!" ...అంటూ మళ్ళీ యిందాకటి అమ్మాయిలే పెల్లిగా వెనకచేరుకున్నారు.

"ఇదేం చోద్యమొసే! యింకా పోలేదూ! ఎంత విరగబడిపోతున్నారే! మీకేం తెలీదనా? అలా చూస్తారూ? మీకు పెళ్ళిళ్లవలేదూ? కాపరాలు చేసుకోడం లేదూ? మరీ పిన్నా పెద్దా! మంచీ చెడ్డా!! లేకండా పోతూంది! చూశావే వెంకమ్మా!"

"అవునర్రా అవును! మీరు చిన్నవాళ్లు. చెడిపోతారు తప్పు! కూడదు. పొండి!"

"ఇన్ని చెబుతూ యిన్నేళ్ళొచ్చి మీకు తెలియకనేనా అంతలా చూస్తున్నారు?" అని ఆ నలుగురిలో ఎవర్తో పుటుక్కుని అడిగేసింది వుండబట్టక.

"ఆఁ! ఏమిటేమిటీ? మా సంగతి వేరు! నిన్నకాక మొన్న మా కళ్ళముందు పుట్టి మాకే చెబుతారే? ఎంత పెడసరప్పిల్లలయిపోయినారే!"

"పదండే పోదాం... మనకెందుకు" —అంటూ ఆ నలుగురూ వీళ్లకి తెలియకండా ఆ పక్కనే కిటికీదగ్గరికి చేరుకున్నారు.

* * *

"కమలా! యిన్నాళ్ల ఎడబాటు నీకు కష్టం అనిపించలేదూ?"

"మీకులేనిది నాకెందు కుంటుంది - మీతోపాటే నేనూను"

"యీ మొదటిరాత్రి నీకెలాటి అనందాన్ని యిస్తూందో చెప్పవూ?"

"................"

"చెబుదూ...!"

"మీకో!"

"నాకే ఎవరనుకుంటారన్న భయం, ఎవరు చూస్తూరో అన్న బితుగూ లేకండా... యిలా ఉండడంకన్నా...అప్పట్లో దొంగతనంగా... అదేబావుంది!

"అవునండి...యీ నలుగురిలో నాకదోలా వుంది,"

"యిది ఆచారంకదూ!"

"అవునుగాని తెల్లవారిం తర్వాత... నలుగురిలోనూ చనువుగా ఎలాగ తిరగడం? నాకు సిగ్గుగా వుంది...పైకి వెళ్లడానికి..."

"సిగ్గెందుకూ...సహజమైన విషయమే కదూ?"

"అయినా ఏమో అనిపిస్తూంది!"

"పోనీ నా దగ్గరేం సిగ్గులేదుకద!" అని దగ్గరగా తీసుకున్నాడు...ఆమెని...

"..............."

"రా కమలా! అలా మంచంమీద కూర్చుందాం."

వద్దండీ...యిప్పుడు—!"

"అదేమిటి యింతకు పూర్వమంటే భయంగాని యిప్పుడేం...యిహ నెవడూ మన నడిగేవాడు లేడుకదూ!"

"అటు చూడండి!"

"ఎటు?"

"తలుపువైపు?"

"ఏం?"

"............"

"ఏం కమలా?"

"చూస్తున్నారు? చప్పుడు వినబడ్డం లేదూ?"

"ఎవరు?"

"అవతలవాళ్లు!"

"నీ కెలా తెలిసింది!"

"నాకు తెలుసు!"

"ఆఁ!...ఎంత సిగ్గు లేదు! ఏమిటి చూస్తారు? వాళ్ళ మొహం—యింకేం చూడవలసిందా?"

"ఏమో అలా చూస్తారు!"

"అంటే—"

"యిలా ఎవరికయినా యీ మూడు రోజులూ చూస్తారు?"

"వాళ్లకి సిగ్గూ లజ్జా లేదూ? అయినా ఎలా చూడగలుస్తారు? తప్పు కాదూ? ఎవరూ వద్దనరూ?"

"పిల్లలయితే పెద్దవాళ్లు కేకలేస్తారు—కాని పెద్దవాళ్ళే అయితే ఎవర్లనగలరు?"

"బావుంది యిదీ ఆచారమేనా ఏమిటి? కొంపదీసి!"

"ఏమో నేనోసారి, మాటవరసని అడుగితే అలానే అన్నారు!"

"బావుంది...యీ ఆడవాళ్ళకి మరేం పనులుండవు కామోసు!"

"అందులోనూ విధవాళ్లకి."

"ఇలా ఎంతసేపని చూస్తారు?"

"తెల్లవార్లూనూ! వాళ్లకేమిటి!"

"తెల్లవార్లూనా? యిదేం బావుండ లేదు...వాళ్లకి తగిన బుద్ధిచెప్పాలి..."

"అదేమిటండీ! వాళ్ళపని వాళ్ళదీ మన కెందుకూ? అయినా వాళ్ళకి సిగ్గుండాలి గాని...ఎవరూ కయ్యలేకే వూరు కున్నారా!"

"అలాకాదు! యిదేం జంతుప్రద ర్శనశాల అనుకున్నారా?"

"అదేమిటండోయ్!"

"అవును. కాదు మరీ...బోనుల్లోనూ...యినపగజాల్లోనూవున్న జంతువులేం చేస్తున్నాయో ఎలా వున్నాయో...'జూ'ల్లో చూస్తారు...అలాగే యిక్కడ యీ గదిలో మనం ఏం చేస్తున్నామో వీళ్లు చూస్తున్నారు...అంతేకదూ...మరేం తేడా వుంది...ఛి ఛీ...మనుష్యులా పశువులా? యిదెలా వచ్చిందో మనకి..."



"ఇస్ వెధవా! తప్పు! నువ్వు చూడకూడదు. పోయిపడుకో"

"యిది అనాదినుండీ వస్తున్నదే!"

"అవును. అదే నేనూ అంటున్నా... యిలాంటి అసభ్యమైన ఆచారం మనలో ఎలా యిన్నాళ్ళనుండి పాతుకుపోయింది? పూర్వులు యిదంతా చూస్తూ ఎలా వూరుకున్నారు.. పోనీ యిదో ఆచారం అని అనుకున్నా, యీ పైమాపుల్లో అర్థం, లాభం, ఏమిటుందని? పూర్వం వాళ్లు యిలాంటి వాటికి వూరుకున్నా..యిప్పటివాళ్లకిది కిట్టదు... అవునా! నువ్వే చెప్పేవు...యిప్పుడు... అయినా అసలు...యీ నలుగురిలోనూ యిదో పెద్ద ఘనకార్యంలా...అందరూ చూస్తూండగా ఒక పురుషుణ్ణీ ఒక స్త్రీని.. వేరే...గదిలో పెట్టడం అన్నదే తప్పు— దీనివల్ల...భార్యాభర్తల బాంధవ్యం యీనాటినుండి శారీరకంగా కలిసింది– అని లెక్క వేసుకుందికి వుపకరించి, ఆ తర్వాత .. ఎన్నో యిబ్బందులు ... లేకుండా చెయ్యడానికి పెద్దలు ఆలోచించి పెట్టారు ... అయితే యీ దొంగచూపు లేమిటి? యిదేం బాగులేదు...వీళ్ళకి తగిన బుద్ధి చెప్పాలి!" వీళ్ళేం చిన్నవాళ్లా చితకవాళ్లా! అన్నీ తెలిసినవాళ్ళే యిలా చూడ్డం ఏమిటి కొత్తగా!"

"బావుండదండీ! అనవసరంగా అందరూ ఆ తర్వాత అనుకుంటారు మన గెంజుడు!"

"నువ్వేమీ మాటాడకు! అలా చూస్తుండు వుర్నాడు మళ్ళీ చెయ్యకుండా చేస్తాను!"

"ఒహదాని కొహటి వస్తుందండీ!"

"ఏవీఁరాగు తేలుకుట్టిన దొంగల్లా వాళ్లే నోరు మూసుగొని వూరుకుంటారు. నువ్వూరుకో..."

అని అతడు తలుపుదగ్గరికి వెళ్ళేడు. యీ మాటలన్నీ పైనున్నవాళ్ళకి వినబడలేదా అని అంటారేమో! ఏమో!! అయినా వాళ్లు యిలాంటి పుణ్యకాలాన్ని వదులుకుంటారా?

యీయన యిలా అకస్మాత్తుగా గభాలున తలుపుతీసేటప్పటికి ఆ గాభరాలో అక్కడున్న అమ్మలక్కలు ఎటు పోడానికీ తోచక తబ్బిబ్బుపడ్డారు...అయితే ఆ వితంతువు లిద్దరూ...అంతలాటి సమయంలోనూ అనుభవం వున్నవాళ్ళు గాబట్టి, వాకిటి ద్వారం తొన్నతప్పుకున్నారు... కాని...అడుగు ఆజల్లోవున్న ఆ అమ్మ యిలుమాత్రం — ఏమీ తెలియక భయంతో పెరట్లోకి పారిపోయారు! అతడు యీ రెండు తలుపులూ గడియవేసి గదిలోకి పోయేడు...కర్మవశాత్తూ ఆయన అనుకున్న విధంగానే జరిగింది. ఏమంటే — ఆనాడు అమర్చబడ్డ గది - వేరే కేటాయింపుగా వుంది. ఆ గది నానుకునే చిన్న సావిడి వుంది. ఆ గదికిపోయే ద్వారం ఆ సావిడిలో నుంచే వుంది. మరే తోవ్వా లేదు. ఒహ కిటికీకూడా అందులోనే వుంది. ఆ సావిడికి ఒకప్రక్క వాకిట్లోకివచ్చే ద్వారం, రెండోప్రక్క పెరట్లోకి పోయే ద్వారం వున్నాయి...అంతే - పెరట్లోకి వెళ్లాలన్నా అటుండి రావాలన్నా యీ సావిడిగుండానే రావాలిగాని మరోదారి లేన్నాలేదు. పెరటిగోడలయినా చాలా ఎత్తుగా దాటడానికయినా వీలులేకుండా వున్నాయి. అంచేత......అమ్మలక్కలు చూడాలంటే యీసావిట్లోంచే చూడాలి, అలాగనే చూసి అతను తలుపు తియ్యగానే అమాయకంగా పెరట్లోకి పరుగెత్తేరు!

"కమలా! అయిపోయింది!"

"ఏమిటండీ? ఏమిచేశారు?"

"నే ననుకున్నట్టు వాళ్లు పెరట్లోకే పరుగెత్తేరు...వెంటనే రెండు తలుపులూ ఘడియవేసి వచ్చేను."

"మంచి...పని...చేశారే! ... అని నవ్వుతుంది.

"యిహ నేలా చూస్తారు!"

"బాగుంది కానండి...వెళ్లి తలుపు తీసెయ్యండి బావుండదు—"

"ఏం!"

"మరి పెరట్లోంచి దారిలేదు...యీ చలిలో తెల్లవార్లూ మనల్ని తిడతారు!"

"కావాలి! అలా అయితేనేగాని బుద్ధి రాదు!"

"వద్దండీ నామాట వినరూ! ఆ తర్వాత నానా మాటలూ అంటారు...అదీకాక వాళ్లవాళ్లు వెతుక్కుంటారు!"

"వెతుక్కోనీ, ఏమవనీ, యివాళ్లా వాళ్ళక్కడ వుండవలసిందే...బాగా యింటి దగ్గర చీవాట్లయితే కాని...రోగం కుదరదు!"

"మీ యిష్టం. నే చెప్పేను బావుండదని. నా మాటవిని అలా చెయ్యండి..."

"నువ్వేమన్నా సరే తియ్యను...పడుకుందాం."

"బావుందండీ మరీను...మన కెందుకీ క్షోభ."

* * *

"తలుపు ఘడియ వేసినట్టుంది కామాక్షీ..."అంది లక్ష్మి భయంతో.

"అవును నిజంగానే వేశాడు... చచ్చాం...ఎలాగ?" అంది వణుకుతూ కామాక్షి.

"అవునర్రా...మరోద్వారం కూడా లేదు. ఎలాగ నాకు భయంవేస్తూంది!"... అంది సుబ్బులు!

"...ఓసే...నాకు అదోలా వుందే...

మా అమ్మ - నాన్న - ఏమంటారో!" అంది నాగులు.

"అవునుగాని వెంకమ్మా! సుబ్బమ్మ ఏరీ?"

"అవును ఏరి చెప్మా!"

"బాగా తప్పించుకుపోయారే! ఆ ద్వారానపోయి వుంటారు! మధ్య మనమే బాగా వుండిపోయాం!"

"చెప్పలేనమ్మకి ఏడవ సిగ్గు! తలుపు మరి తీయకపోతే తెల్లార్లూ ఈ చలిలో ఎలాగు? మా ఆయన ఏమంటారో! ఏ మొహం పెట్టుకు వెళ్ళడం!"

"నేరక చూసేం...అసలే నామీద అతనికి కోపం - యింక తెల్లారేవరకూ ఇంటికి జేరుకోకపోతే ఒళ్లు హూనం చేస్తారు! నాకేం పాలుపోలేదు..." అంటూ ఏడ్చింది సుబ్బులు.

"ఏడవకే సుబ్బులూ - ఏంచేస్తాం... చేసుకున్నది అనుభవించక తప్పుతుందా! వీడమ్మ కడుపు బగారం కానూ? ఎంతపని జేశాడే! ఎలా తెలిసిందో మనం చూస్తున్నామని! మాకు మాత్రం బెంగలేదూ? అసలే మా ఆయన అనుమానం మనిషి... ఏమంటారో!" అంది కామాక్షి.

"చంటిపిల్లని వుయ్యాల్లో వదిలేసి వచ్చేను. మధ్యాన్నం పట్టిన పాలు... చిచ్చుపెడతాడు...ఎలా పోనూ!" అని అంది లక్ష్మి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

"తలుపు పిలిస్తే ఆ దోవని ఎవరైనా వచ్చి తీస్తారేమో!"

"లేదు! ఆ ద్వారంకూడా వేసేశాడు.. చప్పుడయింది! యిహ మన గతి యింతే! వాళ్ళతో ఏమని చెప్పగోడం!"

"మా గొప్పపని చేశాడు లేవే! యిదేం వేళాకోళమేమిటి? మర్యాదా మప్పితం వుండవద్దూ! ఎవరికీ లేంది వీడికే వచ్చిందా? మనకాలంలో మనవాళ్లిలాగే చేశారా?"

"పోనీ తలుపుతియ్యమని దాంతో చేనా చెబితే!"

"బావుందే! ఏమని అడుగుతాం. అయినా ఏం బావుంటుంది. యిలాంటప్పుడు...చూదాం ఎప్పటికయినా తియ్యకపోడు!"

"యీ మూడు రోజులూ అయినాక వీడు చూడమని బ్రతిమాలుకున్నా చూస్తారా ఏమిటే!"

"ఆఁ ఎవరిక్కావాలి! ఏం తెలియందా ఏమిటి?"

"అసలు మనం చూడ్డం నిజంగా తప్పే!"

"యిలా అవుతుందని అనుకున్నామూ! నలుగురూ చూస్తున్నారని చూసేంగాని!"

"ఏదో అనాదినుండీ వస్తున్నదీ... ఎప్పుడూ జరుగుతూన్నదే.. అనుకున్నాం.. గాని..."

"అప్పుడే రెండుగంట లవుతూంది యింకా తీసేట్టు లేదే!"

"మరింక వీడు తియ్యడే! వీడి సిగ్గు బోగులవా!"

"అయితే మరేం చెయ్యడం..."

"ఏంచేస్తాం.. యిక్కడే తెల్లారే వరకూ కునుకుతీద్దాం..."

"అమ్మయ్యో! రాత్రెల్లానా! రేపు ఏం మొహం పెట్టుకు యిళ్ళకి వెడతాం! ఏమని చెబుతాం - ఏమైనా వుందీ!..."

"అవును నిజమేగాని వీడిలా మొండికెత్తి కూర్చున్నాడాయె! ఎలాగు మరి!"

"అంతే తిట్లు తినవలిసిందేను!"

"అదుగో అప్పుడే నాగులు కునికేస్తూంది!"

"అవునే నాకూ నిద్ర వస్తూంది!"

"అయితేరండి యింకెందుకూ! ఆ వరండాలో దొర్లుదాం!"

అని యిలా తర్కించుకుంటూ ఆఖరికి ఏంచేసేది లేక అందరూ గొంగులు పరుచుకుని పడుకున్నారు.

* * *

"అవునే వెంకమ్మా...మనం అలాంటి తొందరపడ్డా తప్పుకున్నామూ! మన పుణ్యం బావుంది. ఆ గుంటలు నలుగురూ చచ్చార్ల!" అని అంది సుబ్బమ్మ...

"ఏం జరిగింది!" అని అడిగింది వెంకమ్మ.

"ఆ తర్వాత వాడు ఆ రెండు తలుపులూ బిగించేశాడట...వాళ్లు పెరట్లోంచి బయటపడ్డానికి దారిలేక అంతసేపూ ఆ చల్లో నానాబాధా పడ్డారట!"

"పోత్రం బాగా అణిగిందిలే! మనం చెబితే విన్నారా! పెళ్లిళ్ళయి కాపురాలు చేస్తూన్నవాళ్లు - సిగ్గులూ లజ్జలూ వుండొద్దూ! మొగుళ్ళదగ్గర ఆమాత్రం భయం వుండకపోతే ఎలాగ?"

"అవునవును! మనలాటివాళ్ళం చూసినా అర్థం వుంది! ముద్దూ ముచ్చటా, వాళ్లకేం రోజూ ఎరిగున్నదేకదూ!" అని మొహం అదోలా పెట్టి అంది.

"అవునే-విన్నావా? వాడి అనుమానం మండా!

ఆ కామాక్షి మొగుడు...అది తెల్లవార్లూ యింటికి రాలేదని, మర్నాడు నానా తిట్లూ తిట్టి దాన్ని పుట్టింటికి తోలేశాడట! ఏమైనా బావుందీ!"

"అలాగా! యిది విన్నావా? సుబ్బుల్ని మరి లేవలేకుండా చితకతన్ని వదిలేసట దాని మొగుడు. పాపం ఆ దెబ్బలకి అది కాబట్టి ఓర్చింది...జ్వరంతో మూలుగుతూందిట! నిజమేనా?"

"అవునే నే చూశాను! పాపం...ఏడుస్తూంది. లక్ష్మి మొగుడు...యింట్లో ఆవేళకి లేకపోబట్టి సరిపోయింది. .అయినా వాడంత తొందరమనిషి కాడు లేవే!"

"నాగు ఎక్కడా కనిపించడం లేదేం.. ఎప్పుడూ వీధిలోనే వుండేది!"

"యింకెందుకు కనిపిస్తుంది?...ఆరోజుని వాళ్ల...నాన్న...యింకెక్కడికైనా తిరుగుతున్నట్టు కనిపిస్తే దాన్ని వాళ్ళమ్మని కూడా వూరుకో నన్నాడుట! అంచేత వాళ్ళమ్మ ఎక్కడికీ పంపడం మానేసింది!"

"మంచి పనిఅయింది లేవే...అపాటి భయభక్తుల్లో వుంచాలి!...అయినా మనకెందుకులే...గోడలకి చెవు లుంటాయి... వూరుకో ఎటొచ్చి మనమీద విరుచుకు పడతారు..." అని యిలా ఆ యిద్దరూ అక్కడున్న వుండబట్టక వాళ్ళమీద అనుకున్నారు. ★

# జాకెట్టు

### శ్రీ సోమయాజుల ప్రకాశరావు

(రంగారావు యింట్లో)

లలిత: ఏమండోయ్, మిమ్మల్నే. ఇల్లు తలబడిపోతున్నా లేవరేం...ఇదిగో, మిమ్మల్నేనండీ...దొంగలు పడ్డారండీ... అబ్బబ్బబ్బా...లేవండీ తొందరగా.

రంగారావు: (గాభరాగా) ఆ...ఆ... ఏమిటి? దొంగలా?...ఎక్కడ?.. ఏం పోయింది?...

ల: మనింట్లో నేనండీ...నా జాకెట్టు..

రం: జాకెట్టా! ... ఇంకా... వెండి సామానులన్నీ భద్రంగా వున్నాయా? యిల్లంతా గాలించి యింకా యేమైనా పోయాయేమో చూడు. పోలీసుకు కబురు చేస్తాను త్వరగా...

ల: నా జాకెట్టొక్కటే కనిపించంది. మిగతావన్నీ యెక్కడివక్కడే వున్నాయి. నా జాకెట్టుమాత్రం లేదు.

రం: ఏ జాకెట్టు?

ల: అదేనండీ ... సిల్కుది...చారలు చార్లీ.

రం: మొన్న పండుగకి కుట్టించుకున్నావు. అదేనా?

ల: ఆ...ఆ... అదే. అదే. పండుగరోజు తొడిగానా. మళ్ళా నిన్న కామమ్మగారింట్లో పేరంటానికి పిలుస్తే, అదే వేసుకెళ్లాను.

రం: ఎక్కడికి పోతుందిలే. ఇంట్లోనే వుంటుంది. ఈ జాకెట్టుకోసం ఎంత గందరగోళం పెట్టావు. మళ్ళీ వెతుకు. నీ జాకెట్టెవరు తీసుకుపోతారులే!

ల: నా జాకెట్టంటే అంత చులకనా మీకు. బట్టలవాడితో రెండుగంటలు బేరమాడి, మూడురూపాయల గుడ్డను రెండుంపావలాకి కొన్నాను. కొన్నప్పటినుంచి అందరికీ దానిమీదే కళ్లాయె. అంతనుంచి జాకెట్టుపోతే, యింకేమైనా వుందా?...

రం. నీ మొహం! వెధవజాకెట్టు యెవడెత్తుకు పోతాడే!

ల: నే నబద్ధా లాడుతున్నానా!... యిల్లంతా గాలించాను. కనిపించటం లేదండీ.

రం: అయితే, యెక్కడికిపోయినట్టు?...

ల: అదే నేనూ అడుగుతూంట.

రం: పనిమనిషియేమైనా ఎత్తుకుపోయిందేమో!

ల: దాని దుంపతెగ! నిన్న అది అంట్లు తోమడానికి రానేలేదండి. చచ్చినట్టు, అన్నీ నేనే తోముకున్నా.

రం: మరి, చూడు. నిన్న కామమ్మగారింటినించి యెన్నింటికి తిరిగొచ్చావు?

ల: నాలుగయింది.

రం: ఆతర్వాత మనింటికెవరైనా వచ్చారా?

ల: ఎవరూ రాందే!...ఆ...ఆగండి... ఆగండి....... జ్ఞాపక మొచ్చింది. ఆవిడొచ్చింది...ఆ...ఊఁ. భలే...... కనిపెట్టేశానండి దొంగని!...

రం: ఎవరూ?

ల: ఆవిడేనండీ.

రం: ఏవిడ?

ల: ఆవిడే! సూర్యనారాయణగారి భార్య, పార్వతమ్మ.

రం: ఛీ, నీ మొహం; ఆవిడకి నీ జాకెట్టుతో యేం పని.

ల: కాదండీ. ఆవిడే దొంగిలిస్తా. నేను జాకెట్టుగుడ్డ కొన్నప్పట్నించి 'చాలా బావుందండి. ఎంతకు కొన్నారండి. నేనెన్నాళ్ళనుంచో యిలాంటి గుడ్డ తెచ్చిపెట్టమని మా వారితో పోరు పెడుతున్నా ఆయన చెవిని వేసుకోరుగదా,' అంటూ వుండేది. ఎందుకో అనుకున్నాను. నిన్న పేరంటానికి వెళ్లానా! అక్కడా యిదే పాట. తనక్కూడా కొనిపెట్టమని చెవిలో జోరీగలాగ ఒకటే గోల...యీ కాలంలో యెవర్నీ నమ్మకూడదు సుమండీ

రం: ఏడ్చినట్టే వుంది, నీ వేదాంతం. సాడేతీన్ రూపాయ జాకెట్టుకోసం ఆవిడ దొంగతనం చేస్తుందా? అదిగాక నీ జాకెట్టు ఆవిడకేం సరిపోతుంది?

ల: మీకు తెలియదు, మీ రూరుకోండి. నే వాళ్లింటికి వెళ్లి కనుక్కొస్తాను.

రం: అలాంటి పిచ్చిపనులు చేయకు. ఆవిడ యేమనుకుంటుంది? 'దొంగతనమంటగడతావా' అని చెప్పుచ్చుకుంటుంది. పరువూ, మర్యాదా వుంటుందా?

ల: నా కొమాత్రం బుద్ధిలేదుటండీ. ఎలా కనిపెట్టాలో అలా కనిపెట్టి, దొంగను పట్టనుటండీ

రం: అబ్బబ్బబ్బా... చెబితే వినవు. పోతే పోనీ. కావలిస్తే మరో గుడ్డ కొనుక్కో. ఆ పోయిన జాకెట్టుకోసం యింత రాద్ధాంత సిద్ధాంతాలు దేనికి?

ల: యిలా చెప్పిచెప్పి నెలకు నాలుగువందలు సంపాదించినా నాలుగురాళ్లు నిలువవేయలేక పోతున్నాం. మీ రూరుకుందురూ! నే నిట్టే తిరిగిరానూ, జాకెట్టుతో సహా...కాస్త యీలోగా పొయ్యి రాజేసి బియ్యం కడిగి పెట్టండి...తలుపేసుకోండి (నిష్క్రమిస్తుంది.)

రం: రామ! రామ! ఆదివారం వచ్చింది

కదా హాయిగా రెస్టు తీసుకుందా మనుకుంటే వీలులేదుకదా! ఈ ఆడవాళ్ళ బుర్రలో ఒక బుద్ధి పుట్టకూడదు... పుట్టిందా...

* * *

[పార్వతమ్మగారి యిల్లు]

లలిత: (తలుపు తడుతూ) పార్వతమ్మగారూ...పార్వతమ్మగారూ.

పార్వతమ్మ: (తలుపు తెరచి) ఎవరూ! ...రండి, రండి లలితమ్మగారా...యిదేం యింత పొద్దున్నే బయలుదేరారు?...ఏం పనిమీద?...

ల: ఆ...యేం లేదు...మిమ్మల్ని చూచి పోదామని.

పా: రండి, లోపలికి.

ల: మీవారింట్లో లేరా?

పా: లేరు. ఇప్పుడే బజారుకెళ్లారు. ఏమైనా పనుందా?...అదేమిటి! అలా ఎగాదిగా చూస్తున్నారు?

ల: (తొట్రుపాటుతో) అబ్బే! యేం లేదు. ఇల్లంతా కొత్తగా సర్దినట్లుంటేను.

పా: ఎప్పటిలాగే వుంది. కొత్త యేమీ లేదే...కూర్చోండి, కాఫీకలుపుకువస్తాను.

ల: ఆ యెందుకులెండి శ్రమ. యింటికెళ్ళాలి. మావారు కాచుకుంటారు.

పా: ఫరవాలేదు లెండి. యీవేళ ఆఫీసు లేదుగా!...యిప్పుడే వస్తాను...(వంటింట్లోకి వెళుతుంది).

[లలిత కోట్ స్టాండుకు తగిలించిన బట్టలను పరీక్షిస్తోఉండగా పార్వతమ్మ కాఫీకప్పుతో ప్రవేశిస్తుంది.]

పా: కాఫీ పుచ్చుకోండి...ఏమిటి చూస్తున్నారు.

ల: (తడబడుతూ) ఆహా...యేం లేదు.. ఆ వంకీకి తగిలించిన...చీర...బార్డరు... బాగుంటే...ఏమిటా అని.

పా: అదా? మా నాన్నగారు సంక్రాంతికి స్పెషల్‌గా నేయించి పంపారు. బావుందా?...

ల: భేషుగ్గా వుంది...

పా: కాఫీ చల్లారిపోతోంది, పుచ్చుకోండి.

ల: దానికేం లెండి. (కాఫీ తాగి) మీ దొడ్లో పూలమొక్కలు యెలా వున్నాయి? అవి చూచిపోదామనే వచ్చాను.

పా: అయ్యో! మీరు చూడాలనుకున్నప్పుడే యేదో ఆటంకం కలుగుతోంది... దొడ్డంతా గలీజుగా వుంది. అడుగు పెట్టడానికి అసహ్యం వేస్తోంది. రేపు సాయంత్రం రండి చూద్దురు గాని.

ల: ఫరవాలేదు లెండి. వెళ్లొస్తాను... సెలవు... (నిష్క్రమణ)

[రంగారావు యిల్లు]

రం: లలితా, జాకెట్టు దొరికిందా?

ల: దొరికినట్టే. దొంగలు యెంతకేనా తెగించినవాళ్లండీ! యెత్తుకుపై యెత్తు!! ఎంత నేర్పు! ఎంత నేర్పు!! దాని తస్సాదియ్యా! యీ కాలంలో యెవర్నీ నమ్మడానికి వీల్లేదు.

రం: ఇంతకూ నీ జాకెట్టుందా, లేదా?

ల: వినండి. పార్వతమ్మ కాఫీ కలిపిస్తానని లోపలికెళ్లింది. వంకీకి తగిలించిన బట్టలన్నీ చూశాను. జాకెట్టు కనిపించలేదు. దొడ్లో యేమున్నా ఆరవేసి వుంటుందేమోనని 'మీ దొడ్లో పూలమొక్కలు చూడాలండీ' అన్నా. దొంగబుద్ధిగా మరి! యెక్కడ తన దొంగతనం బయటపడిపోతుందోనని 'గలీజుగా వుంది. యివాళ మావారు చక్కజేస్తారు. రేపు సాయంకాలం రండి' అన్నది...ఇంకా సందేహమెందుకండీ. తప్పకుండా అదితే తీసింది. స్నేహితుల మనటమే కాని వాళ్లే మోసపుచ్చేదంతాను!

రం: నీ మొహం! అంత అనుమానం వుండకూడదు మనిషికి.

ల: అవునవును......అలా అని. యింత నిర్ధారణగా తెలుస్తూవుంటే యింకా అనుమాన మేమిటి, నా శ్రాద్ధం!

రం: పోనిద్దూ. వేరే జాకెట్టుగుడ్డ కొని పెడ్తాలే.

ల: (కొంచం ఆలోచించి) ఏఁవండీ. ఓమాటు సూర్యనారాయణగారింటికి వెళ్లి రారాదుటండీ?

రం: నువ్వు వెళ్లొచ్చావుగా? యిక నే నెందుకూ?

ల: నా మాట ఎప్పుడు విన్నారు గనక, యివ్వాళ వింటా రనుకోడానికి. (యేడుపు ప్రారంభిస్తుంది)

రం: ఎందుకే నిండింట్లో యిప్పుడు యేడవడం?......

ల: (వెక్కి, వెక్కి యేడుస్తూ) నా మాటే పట్టించుకోరుకదా?

రం: వెళ్లి, యేం చేయమంటావు?

ల: నాలుగు మూలలా చూసి, దొడ్లో కూడా చూసిరండి.

రం: నీ పట్టే పట్టు. భల్లూకపు పట్టు!... సరే వెళ్తున్నా... (నిష్క్రమణ)

ల: (తనలో) పార్వతమ్మ యీ మాటు యెలా తప్పించుకుంటుందో చూస్తాగా?

ల: కనిపించిందిటండీ!

రం: ఆ...కనిపించింది. నే చెబితే విన్నావూ! ఆవిడ తీసుక వెడితేగా కనిపించడానికి.

ల: ఏం జరిగింది?......

రం: సూర్యనారాయణగారింట్లో వున్నారా? అని అడిగాను. 'దొడ్లో వున్నారండి, పిలుస్తానుండండి' అన్నది పార్వతమ్మ. 'వద్దు, నేనే అక్కడికి వెళ్తా'నని దొడ్లోకి వెళ్లాను. బట్టలూ లేవు యేమీ లేవు. అంతా గలీజుగా వుంది. ఆయన బాగుచేస్తున్నాడు.

ల: పార్వతమ్మ ఆవులిస్తే పేగులు లెఖ్ఖపెట్టేరకం. నే వెళ్లినప్పుడే పసిగట్టింది. ఈపాటికి దొడ్లో ఆరవేసిన జాకెట్టు తీసి పెట్టిలో పెట్టి తాళం వేసివుంటుంది.

రం: ఏఁవైనా కాని యిక మళ్లీ ఆ గొడవ యెత్తకు. అయిందేదో అయింది... నా కింత అన్నం పడేద్దూ. పడుకుంటాను.

ల: ఒకరోజు ఆలస్యమయితే అంత చిరాకేఁవిటండీ...జాకెట్టంతు తెలియకే దింకాను.

రం: చాకలివాడికి వేశావేమోనే!

ల: అవునండోయ్!.........ఎంతైనా మొగాళ్ల బుర్ర ఘట్టి బుర్రే.......కొత్త వాడింటికి వెళ్లి చూద్దురూ. ఈ మాటు నాలుగైదు జాకెట్లు పడ్డాయి...వాటిలో యిది వుందో లేదో! మీరు వెళ్ళొచ్చే లోపుగా వంట రెడీ!

రం: బట్టలు తెచ్చినప్పుడు చూసుకోవచ్చులే. వుంటే వాడే తెస్తాడు.

ల: కాదండీ... కొత్త వెళ్ళిరండి... మీకు పుణ్యముంటుంది. అది యెక్కడ వుందో తెలిసేదాకా నాకు నిద్రపట్టదు

రం: నీకు నిద్రపడుతుందో లేదో కాని అది కనిపించేదాకా నన్ను నిద్రపోనివ్వవులా వుంది. నిన్ను పెళ్లిచేసుకున్న పుణ్యానికి తప్పుతుందా...

* * *

ల: దొరికిందా?

రం: లేదు. చాకిరేవంతా గాలించి, చాకలివాడ్ని పట్టేటప్పటికి నా తాతలు దిగొచ్చారు. ఇంతా చేస్తే ఆ జాకెట్టు లేదు.

ల: ఇంకా సందేహ మెందుకు– పార్వతమ్మే తీసుకుంది. ఎప్పుడో ఓరోజు తొడుక్కోకపోతుందా...దొంగను నేను కనిపెట్టకపోతానా?

* * *

పార్వతమ్మ: (తలుపు తడుతూ) లలితమ్మగారూ...

ల: ఆ...వస్తున్నా. ఎవరూ...పార్వతమ్మగారా...రండి, రండి...మిట్ట మధ్యాహ్నం యిలా వచ్చారు?

పా: ఏం లేదు. పిల్లి పెరుగిన్ని కాస్తా దొర్లించింది. కమ్మటి పెరుగంతా వృధా. అందరూ భోజనాలకు కూర్చున్నారు. కొంత పెరుగుంటే పట్టుకుపోదామని...

ల: దానికేం లెండి. ఇస్తానుండండి... (పెరుగు యివ్వగా పార్వతమ్మ నిష్క్రమణ).

* * *

[రంగారావు భోంచేసి పడుకుందామని మంచంమీది దుప్పటిని దులపగా జాకెట్టు క్రిందపడుతుంది.]

రం: ఏమేవ్...నీ జాకెట్టు యిదిగోనే!...

ల: (ఎంగిలిచేత్తో పరుగునవచ్చి) ఇదీ! యెక్కడుంది?...

రం: పడుకుందామని దుప్పటి దులిపితే క్రిందపడింది. ఇక్కడే పెట్టుకుని వూరివాళ్లమీద లేనిపోని నేరాలు మోపావు. జామచ్చ మోపావు.

ల: అనుకుంటూనే వున్నాను... యిందాక, మీరు స్నానం చేస్తుంటే పార్వతమ్మ పెరుగు కావాలంటూ వచ్చింది. ఆ సాకు పెట్టి, దొంగతనం తెలిసిపోతుందేమోనని, జాకెట్టు తెచ్చి పడేసివుంటుంది. ఈ కాలంలో యెవర్నీ నమ్మకూడదండీ...

రం: నీ మొహం! నీ అనుమానాలూ నువ్వూనూ... ఇంకేనా నన్ను పడుకోనీ నిశ్చింతగా! ★



# నంద

కేరియాడె మావితోట పూలపల్లకీలై !

క్రాలె వేప పూవులు ముత్యాలతోరణాలై !

గాలిలో యెదందలో నుయాల లూగె నోప

ఆలింపుము! పిలిచెను! కొమ్మలలో కోయి

దూతిలే చెలంగె దిగంతాల నవావేశమ్ము

వీలి యీ ఖిచార మ్మి లీల వసంతోదయము

# వ గీతిక

సుందర మీ నిమేషమ్మునందే జగ మవతరించె।

నందన యిదె సకల జనానందమ్మై నాట్యమాడె।

కా।

ంటాకా।

ాల బాలికల కేకల కోలాహల మలమె దెసల।

కలలై యెగసె యువాంతరాలు వలపు రంగు కలల

।

వ।

గతము గతమ్మెగద। చెలికాడా। ఇకరాదు సుమా

స్మిత కరుణార్ద్రముగా జీవితమారసి యడుగిడుమా

—శ్రీ పి. గణపతి శాస్త్రి




# ★ ఉగాదిపాట ★

"సింహశ్రీ"

ఉగాదిపండుగ వచ్చినదీ!
జగానశోభలు హెచ్చినవి.
ఉల్లాసంబును దెచ్చింది—
పిల్లలకెన్నో ఇచ్చింది—

తెలతెలవారగ లేచారూ
కలవడంబులను చల్లారు.
రంగవల్లికలుదీర్చారూ
మంగళ తోరణాల్ గూర్చారు—

కొమ్మల కోయిల కూసిందీ
తుమ్మెద 'ఝు'మ్మని తిరిగింది.
హాయిగ వాయువు వీచిందీ
'హాయిహాయి' మనిపించింది—

బాపనయ్య గారొచ్చారూ
పంచాంగంబును దెచ్చారు.
గ్రహ చారంబును నుడివారూ
కానుక లిమ్మని అడిగారూ—,

పెద్దల పూజలు చేస్తామూ
'వేప పచ్చడి'ని తింటాము.
యిల్లిల్లూమే మెడతామూ
బెల్లంపంచీ పెడతాము—

అమ్మను మారాం చేస్తామూ
కమ్మని వంటలు తింటాము.
మస్తుగముస్తా బౌతామూ
నేస్తుల జతలో పోతాము—




“అమ్మా నాపెన్ను ఏదీ?” అన్నాడు రాము కంది పప్పుడబ్బా వెదుకుతూ.

“నే నేమన్నా తీశానా? అదే మిటి ఆడబ్బా తీశావు” అంది అమ్మ.

“అయ్యయ్యో ఉసిరిచెట్టు కొమ్మ విరిగి పోయిందర్రా. ఈపాడ్యే కాలం ఎవరి కొచ్చిందో కాని” అని బామ్మ అంటోంది.

అమ్మ పరిగెత్తింది దొడ్లోకి. ఉసిరి కాయలు దులుపుదామను కొంటు న్నారు ఈరోజున. కాయలన్నీ నేల మీద చిందర వందరగా పడి ఉన్నాయి.

“అమ్మమ్మా! మన రామిగాడు చెట్టు ఎక్కకుండా కాయలు రాలాయి. ఇంచక్కా నేను ఉసిరి కాయ ఒకటి తినొద్దూ?” అంటు న్నాడు చిట్టి.

“ఛా వెధవా! శుక్రవారం ఉసిరి చెట్టుకు దెబ్బ తగల కూడదు. ఇవ్వాళ తగిలింది. ఏదోకీడు. శాంతి చేయించాలి. వెధవగోల” అని అంటోంది, బామ్మ.

“ఏ మొచ్చిందో కాని కొమ్మ దానంతటదే విరుగుతుందా? మన శ్రీనిగాడేడీ?” అంది అమ్మమ్మ. అందరికళ్లు వాడికోసం వెదికాయి.

“వాడే విరగకొట్టి ఉంటాడు. నిన్న ఉసిరికాయలు కావా లన్నాడు కూడా” అని సపోర్ట్ చేసింది చెల్లి. చెట్టుమీద తెల్లగా చిటారి కొమ్మని కనిపించింది. ఇం కేం! మన శ్రీనిగాడే చెట్టుమీద. గబగబా పరిగెత్తింది చెల్లి. అమ్మొ చ్చింది దొడ్లోకి. ఇంతలో గదిలో అక్క గోల! అబ్బబ్బా! “వదల కండి! చంపండి, అయ్యయ్యో కన్నంలో దూరిందిరా. ఎట్లా బాబూ అది కుట్టిందంటే చస్తాము దేముడా? అందరం క్రిందకూడా పడుకొంటాము” అన్న మాటలు విని పించాయి. ఏదో విషజంతువై ఉంటుందను కొన్నా. మా ఇంది రను దర్యాప్తు చేయమన్నా. కను క్కొని వచ్చింది. అది పురికొసట. అది గోడకు, గడపకు మధ్యఉన్న కన్నంలో దూరిందిట. ఎంతపొడిచి

(40-వ పేజీ చూడండి)

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

చీకటిపడగానే తిరిగి ప్రయాణంసాగించాము.

మూడు రాత్రులలో ఇల్లినాయిస్ రాష్ట్రపు ఆఖరి పట్టణం కెయిరోకు చేరుకోగలమని, అక్కడ మిసిసిపీ నదిలోంచి ఓహియో నదిలోకి మారాలని అనుకున్నాము. ఓహియో నదిలోకిపోగానే మా పడవను అమ్మేసి, ఏ పొగబోటులోకో ఎక్కి, నీగ్రో బానిసతనంలేని స్వేచ్ఛా రాష్ట్రాలలోకి పోవచ్చుననికూడా ప్లానువేశాము.

రెండోరోజు రాత్రి ఒక లంకనుంచి బయల్దేరగానే పొగమంచు ప్రమాదకరమైన రూపంలో నది అంతటా వ్యాపించసాగింది. పొగ మంచులో ప్రయాణం చెయ్యటం అసాధ్యం, అపాయంకూడాను. అందుచేత పడవను మళ్ళీ ద్వీపంవద్దకే తీసుకువచ్చి ఒడ్డున చెట్లేమైనాఉంటే కట్టివెయ్యాలనుకున్నాము. కాని తీరాద్వీపంవద్దకువస్తే ఒడ్డున చిన్నచిన్నతుప్పలు తప్ప ఇంకేమీలేవు. నేను డింగీలోఎక్కి ఒడ్డుకు వెళ్లాను. చేత్తో పడవతాడు పట్టుకున్నాను. తాడు ఒకతుప్పకు చుట్టూతిప్పి కట్టివేశాను. కాని ఇంతలో ప్రవాహ వేగంఎక్కువై పడవ తుప్పను వేళ్ళతో సహా పెల్లగించివేసింది. తాడు పట్టుకుందామంటే అందలేదు. పొగమంచు అప్పటికే దట్టంగా అలముకుంది. రెండుగజాలఅవతల ఏముందో తెలియటం లేదు. నాకు విపరీతమైన భయంపట్టుకుంది. నేను డింగీలోనూ, జిమ్ పడవలోనూ ఉండిపోయాము. పడవ ఎక్కడికిపోయిందో, ఎక్కడికిపోతోందో కనిపించటంలేదు.

పడవను వెదుక్కుంటూ డింగీలో బయల్దేరాను. ద్వీపం అంచునే చాలదూరంపోయాను. ద్వీపం దాటి ఒకగజం ముందుకుపోగానే పొగమంచు తెరల్లో మూసుకుపోయినట్లయింది. ఏ వేపుకుపోతున్నానో, ఏ దిక్కు తిరిగివున్నానోకూడా తెలియలేదు. ప్రవాహం ఎటులాక్కెడితేఅటు పోనిచ్చాను డింగీని. జిమ్ ఎంత దూరంలోవున్నాడో తెలియదు. అయినా చూద్దామని "ఓ" అని కేకవేశాను. కొంతసేపటికి ఎదటినుంచి గావును మళ్లీ "ఓ" అని సమాధానం వినిపించింది. అమ్మయ్య, జిమ్ బతికేవున్నాడని సంతోషపడ్డాను. ఆ ధ్వనివచ్చేవైపే డింగీని పోనిచ్చాను మళ్లీ "ఓ" అని అరిచాను. ఈసారి సమాధానం కొంతదూరంలో నా కుడిచేతివైపునుంచి వినవచ్చింది. అరెరెఅనుకుని డింగీని కుడివైపుతిప్పి నడిపాను. ఈసారి ఎడమవైపు నుంచి వినిపించింది. దాంతో నాభయం రెండింతలైంది. ఎంతసేపటికి పడవను చేరలేనేమో, అసలు ఆ అరిచేది జిమ్ అవునోకాదో, ఏదన్నా మంచు దెయ్యమేమో అని భయపడ్డను.

జిమ్‌కు ఏమాత్రం బుర్రఉన్నా ఒకడబ్బా మోగించివుండాలి; విడవకుండా డబ్బామోగిస్తే ఆ చప్పుడుబట్టి నేను పడవను చేరేవాణ్ణి. అల్లాగాక ఉండిఉండి ఎప్పుడో అరిస్తే ఆ అరుపుల మధ్యకాలంలో

నేను తప్పుదోవను పట్టడం జరుగుతోంది. కాని జిమ్‌కు బుర్రవుంటేగా.

కొంతసేపటికి నా వెనకనుంచి కేక వినిపించింది. ఇప్పటిదాకా ముందున్న కేక వెనక్కి ఎల్లావచ్చింది? ఇంకోళ్ళెవరన్నా ఆ కేక వేశారా? లేక నేనే అడ్డంగా తిరిగానా? మళ్లీ వినిపించింది; వెనకనించే గాని స్థలం మారింది. ఆ కేక అలా వినిపిస్తూనే నాదగ్గిరిదాకావచ్చి నన్ను దాటి మళ్లీ ముందుకుపోయింది.

ఇలా ఒకరికేకలను ఒకరం వెంటాడుతూ ఎంతసేపు నదిలో తిరిగామో చెప్పలేను. దగ్గిరికివచ్చినట్టే రావటం, ఏ సుడికెరటంలోనో చిక్కుకుని మళ్లీ దూరంకావటం ఇల్లా కొన్ని గంటలు గడిచింది. చివరికి కేకలు వినిపించటం మానేశాయి. బహుశా జిమ్ పడవ చాలదూరం పోయివుంటుందనుకున్నాను. పొగమంచు విడిపోయేవరకూ నేను చేయగలిగిందేమీ లేదు. అప్పటికే తెగ అలిసిపోయివున్నాను. అందుచేత డింగీలో పడుకున్నాను. ఎప్పుడు నిద్రపోయానో, ఎంతసేపు నిద్రపోయానో తెలియదు.

లేచేసరికి పొగమంచుయావత్తూ మాయమైంది. నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. డింగీ ప్రశాంతమైన నదిలో ఉయ్యాల లూగుతూ ముందుకుపోతోంది. ఇదంతా నిజమా కలా అనిపించింది. జరిగినవన్నీ ఒకొక్కటే జ్ఞాపకం రాసాగాయి. కాని ఎందుకనో ఆ సంఘటనలన్నీ వారంరోజులకిందటి సరుకులాగ అనిపించింది.

నది ఇక్కడ అమిత విశాలంగాఉంది. నక్షత్ర కాంతిలో చూస్తే నది ఆ ఒడ్డు ఈ ఒడ్డు దేవదారు వృక్షాలతో గోడకట్టినట్లున్నాయి. ముందెక్కడో నల్లని చుక్క కనిపించింది. దాని వెంట పడ్డాను. అది పొడుగాటి కలపదుంగ. ఇలాగే నాలుగైదుసార్లు కలపదుంగలుచూసి మా పడవ అనుకుని తరిమాను. ఆఖరికి నా అదృష్టంకొద్దీ మా పడవే ఎదురైంది.

పడవలో కెక్కాను. జిమ్ ప్రాణాలతోనే ఉన్నాడు. మోకాళ్ల మధ్య తలవాల్చి గుర్రుపెడుతూ కూర్చునే నిద్రపోతున్నాడు. పడవనిండా ఆకులు, కొమ్మలు, నానా గజిబిజిగా పడిఉన్నాయి. పాపం జిమ్ చాలా అవస్థపడిఉంటాడు.

డింగీని పడవకు కట్టేశాను. జిమ్ పక్కనే పడుకుని, బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ, వాణ్ణిలేపాను. లేపి ఇలాఅన్నాను:

"జిమ్! లే, లే, నువ్వూనేనూ ఇల్లా నిద్ర పోతే ఎల్లా? తెల్లవారేలోగా ఎక్కడికో అక్కడికి చేరుకోవాలిగదా! నేను కాసేపు కునికితేనువ్వుకూడా కునకాలా? లే, లే."

"ఎవరది? హక్‌గారేనా? మీరు చచ్చిపోలే దాండీ? ఎప్పుడొచ్చారు? బలేవారండీ మీరు ఆ పొగమంచులో చిక్కుకుని చచ్చిపోయారనే భయ పడ్డానండి. బతికొచ్చారుగదా! అమ్మయ్యా, ఎంత భయపడ్డానో మీకోసం?"

"ఏమిటనేదినువ్వు? జిమ్, నువ్వు అదే పనిగా విస్కీ తాగలేదుకద?"

"నేనా, నేనసలు విస్కీ రుచిచూసి ఎన్నాళ్లయిందండి!"

"మరి అల్లా మతిలేనట్టు మాట్లాడతావేం?"

"మతిలేనట్టు మాట్లాడుతున్నానా? మీరనేది నాకర్థంకావటంలేదు."

"నువ్వనేదికూడా నాకర్థంకావటంలేదు. నేనక్కడికోపోయాననీ, మళ్లీ నీకు తెలియకుండా వచ్చాననీ అంటావేం? అసలు నే నెక్కడికిపోయాను? బయలుదేరిన దగ్గిర్నించి ఇక్కడేవున్నానుగదా?"

"హక్‌గారు! హాకల్ బెరీఫిన్ గారూ! ఇదిగో నాకేసి చూడండి; నాకేసిచూసి, నిజం చెప్పండి. మీరెక్కడికీ వెళ్లలేదూ?"

"అదిగో అందుకే నీకు మతిపోయిందంటున్నాను. నేనెక్కడికీ వెళ్లలేదు."

"హక్‌గారూ! మళ్లీ ఏదో తిరకాసువచ్చింది. చచ్చాన్రా దేవుడా! ఇదిచెప్పండి—నేను నేనేనా, ఇంకెవర్నన్నానా? నే నిక్కడేవున్నానా, ఇంకెక్కడన్నా ఉన్నానా?"

"నువ్వునువ్వే. నువ్విక్కడేఉన్నావు. కాని నీ మతిమాత్రం నీ బుర్రలోంచి ఎగిరిపోయింది."

"నేను నేనే నన్నమాట. అయితే ఇది చెప్పండి: మీరు పొగమంచు రావటంచూసి పడవను ఒడ్డున కట్టివేస్తానని డింగీ తీసుకుని వెళ్లారా, లేదా?"

"ఏ పొగమంచు? పొగమంచు ఎప్పుడు వచ్చింది? నేను డింగీ తీసుకుని ఎప్పుడు వెళ్లాను?"

"పొగమంచు రాలేదా? పడవతాడు తెంచుకుని పోలేదా?"

"ఊహూ."

"రాత్రంతా నదిమీద మూసుకున్నది పొగ మంచు కాదూ? చచ్చాన్రా దేవుడా! పోనీ, మీరు డింగీలోంచి, నేను పడవలోంచి కేకలు వేసినమాట నిజమేనా? చెప్పండి బాబుగారూ, చెప్పండి. అటు చూస్తారేం, నాకళ్లలోకి చూడండి."

"నీకు మతిపోయింది జిమ్! అంతకంటే ఏమీ లేదు. పొగమంచూ లేదు, నేను డింగీలో ఒడ్డుకి పోవటం లేదు, ఏమీలేదు. నేను రాత్రంతా ఇక్కడ నీ పక్కనే కూర్చుని మాట్లాడుతూన్నాను. పది నిమిషాలైందేమో నేను నిద్రపోయి. నువ్వూ నిద్ర పోయావు. నువ్వు బహుశా ఇదంతా కలగని వుంటావు."

"పది నిమిషాల్లో ఇంతా ఎల్లా కల గంటాను?"

"మహా చక్కగా కలగనచ్చు."

"కాని-నిజంగా జరిగినట్టు అనిపిస్తోంటే—"

"అనిపిస్తుంది; కొన్ని కొన్ని కలలు అలాగే అని పిస్తాయి."

"ఇలాంటికల ఎప్పుడూ రాలేదండి. అబ్బ! ఎంత నీరసం వచ్చేసిందనుకున్నారు!"

"కొన్ని కొన్ని కలలు మనిషిని అలాగే నీర సింప చేస్తాయి. మొత్తానికి నీకల గమ్మత్తుగానే వుంది."

అక్కణ్ణించి జిమ్ తన కలనుగూర్చి చిలవలు పలవలు పెంచి అద్భుతంగా కోతలు కొయ్యసాగాడు. ముందు మనకి ప్రమాదాలు రాబోతున్నాయని తెలప డానికే దేవతలు ఈకల కల్పించారని చెప్పాడు. పొగ మంచు మాకు రాబోయే కష్టాలను సూచిస్తుందట. పొగమంచు గుండా వినిపించిన కేకలు మామేలు కోరేవాళ్ల సలహాలట. ఆసలహాలు వింటే కష్టాలు దాటుకు పోగలమనీ, లేకపోతే కష్టాలు మన్ని ముంచేస్తాయనీ అన్నాడు. చివరికి పొగమంచు విడి పోయి నందువల్ల కష్టాలుకూడా అంత మౌతాయనీ, సుఖాలనే నక్షత్రాలు ప్రకాశిస్తాయనీ, అన్ని అపాయాలూ దాటుకొని చివరకు స్వేచ్ఛా రాష్ట్రాలలో ప్రవేశించ గలమనీ జిమ్ జోస్యం చెప్పాడు.

నేనంతా విని అడిగాను: పడవమీద ఈచెత్త

చెదారం అంతా పడివుంది గదా! ఇది దేన్ని సూచిస్తుంది?”

జిమ్ ఇంతవరకూ చెత్తగా పడివున్న ఆకులు, కొమ్మలు గమనించలేదు. నేను వాటిని చూపించగానే ఆశ్చర్యంతో వాటివంక చూశాడు. తరవాత నాకేసి చూశాడు. ఆరాత్రి జరిగినదంతా కలేననే అభిప్రాయం అతని మనస్సులో గాఢంగా పాతుకుపోయింది. ఇప్పుడు దాన్ని పెల్లగిద్దామంటే ఎంతసేపటికీ సాధ్యంకాలేదు. ఆకల స్థానంలో యథార్థాన్ని ప్రతిష్ఠించటం గగనమై పోయింది. చివరి కిలాగైతేనేం ఆ ప్రయత్నంలో గెలిచాడు. నాకళ్లల్లోకి సూటిగా చూశాడు. నాకు నవ్వు వస్తున్నా ఆపుకున్నాను. అతని మొహంలో నవ్వన్న మాటలేదు. ఇలాగన్నాడు:

“అవి వేటెని సూచిస్తాయని అడుగుతున్నారా? చెబుతా నాగండి. పొగమంచులో చిక్కుకున్న తర్వాత మీరు కనిపించక ఎంతైనా గాబరా పడ్డాను. మిమ్మల్నెంత పిలిచానో, ఎంత గుండెలు పగిలేట్టు కేక లేశానో, ఎంత ఏడ్చానో చెప్పలేను. అలిసిపోయి అలాగే నిద్రపోయాను. లేచేటప్పటికి ఎదురుగుండా మీరున్నారు. నాకు కళ్లంబడి నీళ్లువచ్చాయి. మీ పాదాలు ముద్దు పెట్టుకోవాలన్నంత కృతజ్ఞత, ప్రేమ కలిగాయి. మీరు నా సంగతేమీ చూడకుండా అబద్ధాలుచెప్పి ఈ అమాయక నీగ్రోని పిచ్చిదద్దమ్మ కిందకట్టి ఏడిపించారు. మీరాడిన అబద్ధాలే ఈ చెత్త చెదారం. అమాయకులైన స్నేహితుల నెత్తిమీద అబద్ధాల బురద పూస్తారే—వాళ్లు ఈచెత్త చెదారమూ. తెలిసిందాండి.”

జిమ్ నెమ్మదిగాలేచి పడవమీది డేరాలోకి పోయి కూర్చున్నాడు. మౌనంగా ఏదో ఆలోచిస్తున్నాడు. నేనూ అల్లాగే కూర్చుండి పోయాను. జిమ్ హృదయాన్ని అలా గాయపరిచిన నా నీచత్వాన్ని ఎన్నోసార్లు తిట్టుకున్నాను. నాకంటే పురుగుగాదు లేడని పించింది. జిమ్ అంత అలా నొచ్చుకుంటాడంటే అతనితో అబద్ధాలాడే వాణ్ణేకాను. ఒక పావుగంటసేపు నా అంతరాత్మతో కుస్తీపట్టాను. ‘నేను తెల్ల వాణ్ణి, జిమ్ నీగ్రో’ అనే భావాన్ని మూలమట్టంగా చంపుకుని లేచాను. జిమ్‌వద్దకు వెళ్లి అతనిముందు మోకరించి క్షమాపణ వేడుకున్నాను.

ఆతర్వాత జిమ్‌తో ఎప్పుడూ అబద్ధాలాడ లేదు; వేళాకోళం చెయ్యలేదు.

## 16

తెల్లవారిం తరవాత ఒకద్వీపంమీద మకాంచేసి పగలల్లా నిద్రపోయాము. రాత్రిలేచి మళ్ళీ బయల్దేరాము. మాకుముందు కొంత దూరంలో ఒక పెద్ద పొగబోటు ప్రయాణిస్తోంది. దానిమీద అయిదు పెద్దగదు లున్నాయి; బోటుమధ్యలో నెగడుఉంది. చూట్టానికి అందంగా వుంది. బహుశా ముప్ఫయ్ మందిదాకా మనుషులుండి వుంటారని అనుకున్నాము.

నేనూ, జిమ్ కెయిరోనిగూర్చి మాట్లాడుకున్నాము. కెయిరో పట్టణం సమీపిస్తే దాన్నిగుర్తు పట్టగలమో లేదోనని సందేహం వేసింది. ఎందుకంటే కెయిరోలో అట్టే ఇళ్లు లేవట. రాత్రి పూట అక్కడ లైట్లు కనిపిస్తేగాని అక్కడొక గ్రామం ఉన్నట్టు కనిపెట్టలేము. లైట్లు కనబడకపోతే గ్రామం దాటి పోతాము. జిమ్ ఉపాయం చెప్పాడు. కెయిరో దగ్గిర ఓహియో, మిసిసిపీనదులు కలుస్తాయి గదా! దాన్నిబట్టి కెయిరోను గుర్తు పట్టవచ్చు. కాని రెండు నదులూ కలిసినప్పుడు ఏనది ఏదో గుర్తు పట్టలేము; మళ్లీ మిసిసిపీ నదిలోకే రావచ్చు. కనుక ఈ ఉపాయంకూడా బాగాలేదు. తరవాత నాకోఉపాయం తట్టింది. ముందెక్కడన్నా లైటు కనిపిస్తే, నేనక్కడికి డింగీలోపోయి అక్కడి మనుషులను వాకబు చేస్తాను. మానాన్న పెద్ద పొగబోటులో వెనక వస్తున్నాడన్న కెయిరో ఎంత దూరంవుందో నన్ను కనుక్కురమ్మని పంపాడనీ చెబుతాను. జిమ్ ఈ ఉపాయం బావుందన్నాడు. దాన్నిగూర్చే చర్చిస్తూ చుట్టలు కాల్చుకున్నాము.

కాని అలా ఉరికే కూర్చోటం విసుగనిపించింది. ఆకాశమంతా మబ్బులుదట్టంగాపట్టి చీకటి గాఢంగావుంది. అందుచేత పొగబోటువరకూ యీదుకుని వెళ్ళి, పైకెక్కి, వాళ్ళేమైనా కెయిరోనుగూర్చి

(39-వ పేజీ చూడండి)




ఆలిస్ కూచున్న సీసా నీటిలో తేలూ వెళ్లి వెళ్లి ఒక గట్టుకి చేరుకుంది. ఆ గట్టు దగ్గిర కొన్ని బాతులూ, ఎలకలూ కోళ్లూ ఏదో పాడుతూ గంతులేస్తూ గుండ్రంగా పరుగులెత్తుతున్నాయి. ఆలిస్ గట్టెక్కి వాటిని పిలిచేలోగానే అవి ఒళ్లు దులుపుకుంటూ తలో దారినీ వెళ్లిపోయాయి. ఆలిస్ మెల్లిగా ఒక అడవి చేరుకుంది. ఆ అడవిలో ఉన్నట్టుండి అకస్మాత్తుగా మొదట కనపడిన తెల్లకుందేలు గాభరాగా పరిగెత్తడం చూసింది. ఆలిస్ దాన్ని వెంబడించి వెళ్లేసరికి ఒక బుల్లి మేడ కనపడింది. కుందేలు మేడమీది కిటికీలో నిలబడి ఎవరినో పిలుస్తోంది. "ఒరే! ఎక్కడ చచ్చావు. అయ్యయ్యో ఆలస్యమైపోయింది. నా విసనకర్ర కనబడదేరా" అని కేక లేస్తోంది. తరవాత హడావిడిగా ఇంట్లోంచివచ్చి తోట వెతకడం మొదలెట్టింది. ఆలిస్ ఇంట్లో దూరి మేడెక్కింది. మేడమీద ఒకగదిలో బుల్లి పెట్టే, ఆ పెట్టెలో రెండే రెండు బుల్లి బిస్కట్లూ కనపడ్డాయి. ఆలిస్ తీరిగ్గా కూచుని ఒక బిస్కట్టు తీసి కొరికి తింది. తినగానే అమాంతం పెద్దదైపోయింది. ఇల్లు పట్టనంత పెద్దదైపోయి చేతులూ కాళ్లూ ఇంటిలోనుంచి పైకి పొడుచుకువచ్చాయి. ఇల్లు ఫెళ ఫెళ మంది. కుందేలు వెనక్కి చూడకుండా తోక ముడిచేసింది. తొంగి చూడబోయిన తోటమాలి తొండని తన్నేసరికి అది ఆకాశమెత్తున ఎగిరిపోయింది. ఆలిస్ మెల్లిగా రెండో బిస్కట్టు అందుకుని కొరికింది. మళ్లీ జానెడు బొమ్మంతగా ముడుచుకుపోయింది. వెంటనే ఆలిస్ అడవిలోకి పరుగెత్తింది. ఆపైన ఏం జరిగిందో మళ్లీవారం చూడండి.

గట్టుదగ్గిర బాతులూ ఎలకలూ కోళ్లు గుంపులుగా పరుగు లెత్తుతున్నాయి.

మేడమీద కిటికీలో నుం  ని తెల్లకుందేలు పిలుస్తోంది.

*            *            *

ఆలీస్ పెద్దదైపోయి ఇల్లు ఫెళఫెళమంది.

# ఋతువులరాణి వసంత కాలం

ఇవ్వాళ చైత్ర శుద్ధ పాడ్యమి. నందననామ సంవత్సరం ప్రవేశించింది. ఈ ఉగాది రోజున నీకు ఆశీర్వచనాలు పంపిస్తున్నాను. 'నందన' అంటే ఆనందం కలగజేసేది అని అర్థం. ఈ సంవత్సరం నీకు ఆనందం కలగజెయ్యాలని కోరుతున్నాను.

మొన్న చెన్నపట్టణం వీథుల్లో నడుస్తుంటే, ఎక్కణ్ణించో కుహూ కుహూ అని కోకిల కూసింది. చెన్నపట్టణంలో, మురికి సందుల్లో, ఇరుకు ఇళ్లల్లో ఉండే నాలాంటి వాళ్లకి కోకిల కూసిందీ అంటే ప్రాణంలేచి వస్తుంది. నువ్వెప్పుడూ చెన్నపట్టణం చూడలేదు గనుక నీకు ఇదేదో అద్భుతమైన అలకాపురమని మోజుగా వుంటుంది. కాని రోజూ ఈఊళ్లో తిరుగుతూ, ఉద్యోగంలో సతమత మవుతూ ఉండే నాకు ఎల్లా ఉంటుందో తెలుసా? గట్టిగా తలెత్తితే తంగున ఏదో నెత్తికి కొట్టుకుంటుందన్నట్లు, ట్రాము, బస్సు, కారో మీద పడుతుందన్నట్లు భయం భయంగా రోడ్లమీద నడవాలి. అందుకే ఈఊరు వచ్చాక నాకు ఆకాశం, చంద్రుడు, మబ్బులు, నక్షత్రాలు కనబడ్డం మానేశాయి. ఎప్పుడూ రోడ్డుమీదే చూపులు. అసలు ఏ ఋతువులు వస్తున్నాయో, ఏ ఋతువులు పోతున్నాయో, కూడా తెలియదు. మొన్న కోకిల కూసేటప్పటికి "వసంత ఋతువు వచ్చినట్టుందే," అని అనుకున్నాను. ఋతువులరాజు వసంతుడికి రాయబారులు కదూ కోకిలలు!

ఈఊళ్లో గనక కోకిల కూతలు అపురూపంగా ఉన్నాయి గాని మనవూళ్లో కోకిలలకి కరువే లేదు. ఊరిబైట కావలసినన్ని మామిడి చెట్లు. మామిడి చెట్లమీద కనబడకుండా గుబురుల్లో దాక్కుని లెక్కలేని కోకిలలు. రాత్రి పొద్దుపోయే వరకూ కుహూకుహూ మని ఎడతెగని కోకిల పాటలు. కోకిల పాటలన్నా, వసంత ఋతువన్నా కవుల కెంత ఇష్టమనుకున్నావు! ప్రపంచంలోని అన్ని భాషలలోను కవిత్వం రాయటం చేతైన ప్రతివాడూ వాటిమీద పద్యాలు, పాటలు రాసి పారేశాడు.

ఏమిటి అన్ని ఋతువుల్లోకీ వసంత ఋతువుకే ఇంత ప్రత్యేకత, అని అడుగుతావా? గ్రీష్మఋతువులో ఎండలు మండిస్తాయి. వర్ష ఋతువులో హోరున వర్షాలు కురుస్తూ, వీధులన్నీ బురదలై, చికాకు పుడుతుంది. అట్టే అంత చలీ, అంత ఎండా లేకుండా రాత్రిళ్లు స్వచ్ఛమైన వెన్నెల కాస్తుంది గనక శరదృతువు కొంత బావుంటుందనుకో. హేమంత ఋతువులో చలి గడ గడ వణికిస్తుంది. శిశిర ఋతువులో ఆకులన్నీ రాలిపోయి చెట్లన్నీ బోసిగా కనిపిస్తాయి. వసంత ఋతువులో మాత్రం ప్రకృతి తలంటి పోసుకుని కొత్తబట్టలు, కొత్తనగలు సింగారించుకున్నట్టు, సర్వాంగ సుందరంగా శోభిస్తుంది; రాత్రిళ్లు చల్లని వెన్నెల కాస్తుంది; చల్లని గాలులు వీస్తాయి. కవులకి ప్రకృతేగదూ దేవత? అందుకని వసంతకాలాన్ని

వసంత కాలంలోని ప్రకృతిని ఊరికే తెగవర్ణిస్తారు.

ఋతువుల్ని మనుష్య జీవితంలోని వివిధ దశలతో కూడా పోలుస్తారు కవులు. వసంత ఋతువు యౌవనంలాంటి దట. వర్ష ఋతువు నడివయస్సు లాంటి దట. ఆఖరి ఋతువు శిశిరం వృద్ధాప్యమట. ఇలా వర్ణిస్తారు. కవుల చమత్కారానికి అడ్డేమిటి?

రవీంద్రనాథ టాగూరు "వసంత రథం" అనే చక్కటి నాటకం రాశాడు అందులో అనగనగా ఒక రాజుంటాడు. ఆ రాజు ఓరోజు అద్దంలో చూసుకుంటూ తన చెవి పక్కన ఒక నెరిసిన వెంట్రుక ఉన్నట్లు కనిపెడతాడు. వెంట్రుకలు నెరుస్తున్నాయి అంటే ముసలితనం వస్తోందన్న మాటేగా. మృత్యువుయొక్క రాయబారి చెవి పక్కన దాక్కుని "నీకు ముసలితనం వచ్చిందిలే" అని చెబుతున్నట్టు ఆ రాజుకి తోస్తుంది. భయపడతాడు. ఆస్థానకవిని పిలిచి "నేను ముసలివాణ్ణవుతున్నాను. నాకు మృత్యువు దగ్గిర పడింది. ఏం చెయ్యమంటావు?" అని అడుగుతాడు. ఆ కవి రాజుకు ధైర్యం చెప్పటానికని ఒక నాటకం రాసి ప్రదర్శనం వేయిస్తాడు.

ఆ నాటకంలో కథ ఇది: ఒక అడవి ఉంటుంది. అడవిలోకి వసంతం వస్తుంది. చెట్లన్నీ చిగురిస్తాయి. పువ్వులు విరగ బూస్తాయి; పువ్వుల్లోంచి తేనె వాగులై ప్రవహిస్తుంది. అడవిలోని తుమ్మెదలు, కోకిలలు, పిల్లగాలులు, వెదురు పొదలు, చిగురుటాకులు అన్నీ 'వసంతుడే మాకు రాజు' అని పాటలు పాడుతూ నృత్యం చేస్తాయి. ఇంతలో శిశిర ఋతువు ముసలివేషంలో వస్తుంది. చెట్ల ఆకులు, పువ్వులు రాలిపోతాయి. కోకిలల గొంతుకలు చలితో బిగుసుకుని మూగపోతాయి. వెదురు పొదలు సంగీతం మానేసి దీనంగా ఏడుస్తాయి. కాని కొంతసేపటికి మళ్లీ దూరంనించి కాలంయొక్క అనంత పథం మీద వసంత రథం వస్తున్న మువ్వల సవ్వడి వినిపిస్తుంది. దాంతో వాటికి అసలు రహస్యం తెలిసి పోతుంది: వసంతమే శిశిర వేషం వేసుకుని వచ్చినట్టు. అప్పుడవి ఆముసలి వేషం లాగి పారేస్తాయి. ఎప్పటి మాదిరి నిత్య యౌవనవేషంతో వసంత ఋతువు బయట పడుతుంది. "అమ్మదొంగా! నువ్వేనా, ముసలి వేషంలోవచ్చి మమ్మల్ని హడలగొట్టావు?" అని పువ్వులు, పక్షులు అన్నీ ఆనందంతో నృత్యం, గానం మొదలెడతాయి.

కాలమనేది ఒకటే; కాని వసంతర్తువు, వర్షర్తువు, శిశిరర్తువు ఇలా రకరకాల వేషాల్లోవచ్చి మనల్ని మోసపుచ్చుతుంది. శిశిరం వచ్చిందని దిగులుపడనక్కర్లేదు. దాని వెనకాలే వసంతం వస్తుంది. అల్లాగే జీవితం కూడా ఒక్కటే. యౌవనం, వార్ధక్యం ఒకటే జీవితం యొక్క రెండు దశలు. అని ఈ వేదాంతం బోధించేటప్పటికి ఆ రాజు ముసలితనం వచ్చిందనే దిగులుమాని సుఖంగా వుంటాడు.

కొందరు కవులు వసంతాన్ని సంతోషం, ఆశ, కొత్తదనం వీటితో పోలుస్తారు; వర్ష ఋతువును

దుఃఖం, నిరాశ, నీరసం వీటితో పోలుస్తారు. ఇల్లా పోలిస్తే వర్ష ఋతువుకు కోపంరాదా, అని నువ్వు అడగ వచ్చు. వర్ష ఋతువును దుఃఖంతో పోల్చినంత మాత్రాన దాన్ని అవమానించాలని కవుల ఉద్దేశం కాదు. వర్షాలు లేందే పంటలు పండవు. చెట్లు, పైర్లు అన్నీ మాడి చక్కా పోతాయి. అందులో మన దేశంలాంటి బీద దేశానికి వర్షాలెంతో ముఖ్యం. కాని ఈకవులు బలేచిత్రమైనవాళ్లు. మనకి వర్షాలెంత ముఖ్యమో కవులకి దుఃఖం, నిరాశఅంత ముఖ్యం. దుఃఖం లేందే అసలు వాళ్లు కవిత్వం రాయలేరు; దుఃఖం లేకపోతే వాళ్లకి ఆనందం లేదు. జీవితానికి ఆనందం, దుఃఖం రెండూ అవసరమే నంటారు వాళ్లు. ఈరోజున వేపపువ్వు పచ్చడి తింటాం మనం. ఆపచ్చడి కొంత చేదుగా, కొంత తియ్యగా, వుంటుంది. అంతా తియ్యగానే ఉందనుకో; కొంత సేపటికి మొహం మొత్తుతుంది.



అందుచేత తీపికి తోడుగా కొంత చేదు అవసరం. అల్లాగే జీవితంలో కూడా ఎప్పుడూ ఆనందంగావుంటే దానికి విలువే ఉండదు. తగు మాత్రంగా దుఃఖం వుంటే ఆనందానికి విలువ వస్తుంది. ఇదీ ఈ కవుల వాదం.

సంవత్సరాది అందరికీ, ముఖ్యంగా పిల్లలకి సంతోషం కలిగించే పండగ. పెద్దవాళ్లు దేవాలయాల్లో సమావేశమై కొత్తపంచాంగాలు చదువుతారు. కొత్త సంవత్సరంలో పంటలెల్లా ఉంటాయి, వానలు, ఎండలు ఎల్లా ఉంటాయి, ధరలు, ఇతర పరిస్థితులు ఎల్లా ఉంటాయి అని తెలుసు కుంటారు. ఇళ్లల్లో ఆడవాళ్లుకూడా కారాలు, ఆవాలు పిండి చేసుకుని రెడీగా ఉంచుకుంటారు ఊరగాయ కాయల కోసం ఎదురు చూస్తూ. మగపిల్లలు మామిడి పళ్లెప్పుడు వస్తాయా, ఎప్పుడు జుర్రుకుందామా, అని పళ్లబళ్లకోసం ఎదురు చూస్తూ ఉంటారు.

మీ ఆడపిల్లలకి కూడా వసంతకాలమంటే ఎంతో ఇష్టం. బహుశా తలనిండా కరువుదీరా పెట్టుకోటానికి మల్లెపువ్వులు, సన్నజాజులు ఈకాలంలో విరగ బూయటమే కారణమను కుంటాను.

కాని నిజంచెప్ప వలసివస్తే మన దక్షిణ భారత దేశంలో ఋతుభేదాలు స్పష్టంగా తెలియనే తెలియవు. వసంత కాలం ఇంకా రాకుండానే ఎండలు తీవ్రంగా కాస్తాయి. గ్రీష్మకాలం ముగియకుండానే వానజల్లుపడి వర్షాకాలమంతా పూరుకుని తరవాత వానలు కుండ పోతగా కురుస్తాయి. ఇక ప్రత్యేకంగా చలికాలం అంటూ ఉండనే వుండదు. ఏదో కొంచెం ఉన్నానని పిస్తుంది తప్ప చలి బాధ పెట్టదు. కాని యూరపియన్ దేశాల్లో ఈఋతువులన్నీ వేటికవి ప్రత్యేకంగా కనిపిస్తాయి. వాళ్లకేనిజమైన వసంతకాలం, నిజమైన చలికాలం వస్తాయి. మనదేశంలో ఉత్తరాన హిమాలయ పర్వతాల వేపుకూడా ఈఋతువులు నిజరూపాలతో కనిపిస్తాయి. నేను కొంతకాలం అటువేపు ఉన్నాను కదూ. అక్కడ ఎండలూ ఎక్కువే; చలీ ఎక్కువే; వానలూ ఎక్కువే. ఒకసారి వసంతకాల ప్రకృతిని చూశాను. ఎంత బావుందను కున్నావు? శిశిర ఋతువులో ఆకులురాలి బోడిగా తయారైన చెట్లు చైత్ర మాసం రాగానే చిగుళ్లు తొడిగాయి. ఒక కొండ వుంది; ఆకొండ నిండా దట్టంగా బోలెడు చెట్లున్నాయి. చెట్లమీద సందు లేకుండా నెత్తురు రంగు లాంటి ఎర్రటి చిగురుటాకులు. దూరంనించి చూస్తే ఆకొండని ఎవరో తగల బెడుతున్నట్లు, ఎర్రటి మంటలు ఆకాశానికి లేస్తున్నట్లు అనిపించింది. ఆదృశ్యం ఎప్పటికీ మరుపురాదు.

ఈపాటికి నువ్వూ, తమ్ముళ్లు, చెల్లాయిలు తలంట్లు పోసుకుని కొత్తబట్టలు కట్టుకుని కోలాహలంగా వేపపువ్వు పచ్చడి నంచుకుంటూ ఉంటారు. మీ అందరికీ శుభం కలగాలని మళ్ళీ ఇంకోసారి ఆశీర్వదిస్తూ,

నీ అన్నయ్య

—ఎన్నార్.



# పక్షుల ప్రపంచయాత్ర

మనం ఎవరమైనా విదేశాలకు పోవాలంటే ప్రభుత్వం 'పాస్‌పోర్టు'లు యివ్వాలి. అలాగే యితర దేశాల వారెవరైనా యీ దేశానికి రావాలన్నా ఆ దేశపు ప్రభుత్వం 'పాస్‌పోర్టు' యివ్వాలి. ఈ పాస్‌పోర్టులు సంపాదించాలంటే ఎంతో కష్టపడాలి. ఏ కష్టమూ లేకుండా ఏ దేశానికి పడితే ఆ దేశానికి పోయే ప్రాణులు కొన్ని వున్నాయి—అవే పక్షులు. ప్రపంచ పౌరులంటే పక్షులే అని చెప్పాలి. పైగా పక్షులు మనుష్యుల లాగు, ఒకరు యిద్దరుగా కాక వందలు, వేలు కలసి ప్రయాణం చేస్తాయి. మనుష్యులు చేసే ప్రయాణాలు ఎప్పుడో కాని జరుగవు. పక్షులు ప్రతి సంవత్సరమూ ప్రయాణం చేస్తాయి. మనుష్యులకు కొత్త చోటికి పోవటమంటే సహజంగా కొన్ని భయాలు వుంటాయి. పక్షులకు అలాంటి వేమీ లేవు. అంతే కాకుండా తమ గూళ్లను వదలి వెళ్లిన ఏ 5,6 నెలలకో మళ్లీ అన్ని వేలమైళ్లూ ప్రయాణం చేసి సరిగా ఏపక్షి గూటికి ఆపక్షి వెళ్లి పోగలదు.

మనుషుల ప్రయాణాలకు చాలా మటుకు వృత్తి వ్యాపారాలు కారణాలు. కొన్నికొన్ని సందర్భాలలో ఎక్కడైనా క్షామం ఏర్పడితే, అప్పుడు మాత్రం మనుష్యులు గుంపులు గుంపులుగా బుట్ట, తట్టా, పిల్లా జెల్లాతో బయలుదేరి కొంచెం పంటలు పచ్చగా వున్న చోటికి చేరి అక్కడ గడ్డురోజులు గడుపుకొని, తదనంతరం మళ్లా వానలుపడి పరిస్థితులు బాగుపడ్డాక తిరిగి వస్తూ వుండటం కద్దు. పక్షులకు యిలాంటి అవసరం ప్రతి ఏడూ వస్తూనే వుంటుంది. చల్లనిచోట పెరిగే పక్షులైతే వేసవి వచ్చేసరికి అక్కడి నుంచి కదలి యింకా ఎగువను యింత చల్లగానూ వుండే చోటుకు వెళ్లిపోతాయి. చలికాలంలో ఎక్కడినీళ్లు అక్కడ గడ్డకట్టుకుపోయి, ప్రాణి మసలటానికి కష్టంగావుండే ప్రాంతాలు కొన్ని వున్నాయి. అక్కడ పుట్టిపెరిగే పక్షులు చలికాలం వస్తున్నదనగానే గుంపులు గూడి అక్కడి నుంచి బయలుదేరి వేలకొలది మైళ్లు ప్రయాణం చేసి ఎక్కడి వాతావరణం తమకు అనుకూలంగా తోస్తుందో అక్కడ నివాసాలు ఏర్పరుచుకొంటాయి. గుండ్రని యీ భూగోళం తనచుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ ప్రదక్షిణం చేస్తున్న కారణంచేత అన్ని చోట్లా ఒకేసారి శీతకాలం రాదు. సూర్యునికి దూరంగా వున్న ప్రాంతంలో శీతకాలం ముందు వస్తుంది. భూమి తిరగటంవల్ల యీ భాగం క్రమేసి సూర్యునికి దగ్గరకు వచ్చి వేడి హెచ్చి, వేసవి వస్తుంది. అంతవరకు సూర్యునికి దగ్గరగా

వున్న భూభాగం అంత కంతకు దూరమైపోయి, వేడితగ్గి, శీతకాలం వస్తుంది. ఎక్కడ శీతకాలం విప మిస్తే అక్కడినుంచి పక్షుల గుంపులు బయలుదేరి యింకా ముందు ప్రాంతానికి పోతాయి. అంటే ఏడాదికి రెండుసార్లు పక్షులు స్థానాలు మారుతాయన్న మాట. ఈమార్పును చూస్తే ఒకవిషయం స్ఫురణకు వస్తుంది. లోగడ మన దేశాన్ని బ్రిటిష్‌వారు పరిపాలిస్తున్నప్పుడు పై ప్రాయి చలి కాలంలో ఢిల్లీలోవుండి, వేసవికింకా వస్తున్నదనగానే హిమాలయ ప్రాంతంలో వుండే సిమ్లాకు బసమార్చి వేస్తువుండేవాడు. అలాగే యీ పక్షులు కూడా! ఈ భూగోళంలో కొన్ని ప్రాంతాల పగటివెలుగు చాలా కొద్ది గంటలే వుంటుంది. శీతకాలం వచ్చేసరికి పగటిభాగం మరీ అల్పమై పోతుంది. కొన్నిచోట్ల 40 నిముషాలు మాత్రమే పగలట! ఇంత అల్ప వ్యవధిలో పక్షులు తమకు కావలసిన ఆహారాన్ని అంతనీ ఎలా సేకరించుకొంటాయి? అందు కని అటువంటి దుర్దినాలు వచ్చే సరికి అక్కడి పక్షులన్నీ 'పొల్లో' మంటూ ఎగిరిపోయి మరెక్కడైనా పగలు బాగా దీర్ఘంగా వుండేచోట ఆ దశదాటిపోయేవరకు వుంటాయి.

ఏ ప్రాంతంలో పట్టితే ఆ ప్రాంతంలో నిన్నటి దాకా అక్కడ కనుపించని రకరకాలపక్షులు యీ వేళ వుదయంలేచి చూచేసరికి బిలబిలావచ్చి వాలుతాయి. మళ్లీ వున్నట్లేవుండి మాయమైపోతాయి. క్రొత్త పక్షులు ఎక్కడి నుంచి వస్తున్నాయనే విషయం అనాది నుంచీ మనుష్యుల వూహాకు అందేది కాదు. ఈ పక్షులన్నీ నీరు యింకి పోయిన నీటి మడుగుల్లో దాక్కొని వుండీ మళ్లీ 'ఋతువు' వచ్చేసరికి పైకి వస్తాయని నమ్మేవారు. చాలా మంది అసలు యీ క్రొత్తపక్షులు యిలావచ్చి వెళ్లాయని గమనించ నైనా గమనించరు. గమనించిన వారైనా వసంత ఋతువులో చెట్లు ఆకు పచ్చగా కనుపించటం ఎంత సహజమైన విషయంగా ఎంచుతారో, యిన్నిరకాల పక్షులు వున్నట్లుండి కనుపించి మళ్లీ మాయమై పోవటాన్నికూడా అంత సహజంగానే పరిగణిస్తారు. ఇందును గూర్చిన జిజ్ఞాసగల కొందరు పాశ్చత్యులు ఎన్నో రకాలైన పరిశోధనలు జరిపారు. పక్షులు సాధారణంగా గంటకు 40 నుంచి 50 మైళ్ల వేగంతో ఎగురుతాయనీ గాలివాలులో 55 నుంచి 60 మైళ్ల వేగంతో కూడా పోగలవనీ వీరు కని పెట్టారు. రోజుకు 5, 6 గంటలు విడువకుండా ప్రయాణం చేస్తాయట. కానీ సముద్రంమీద ఎగిరేటప్పుడు ఒక్కొక్కపక్షి ఆహారం కోసం కానీ, విశ్రాంతి కోసం కానీ ఆగక 2, 3వేల మైళ్లు ఏకధాటిగా ప్రయాణంచేసిన సందర్భాలు వున్నాయి. ఆర్కిటిక్ ప్రాంతలోవుండే 'టెర్న్' అనే పక్షిజాతి అంటార్కిటిక్ ప్రాంతంలో వేసవి వచ్చినప్పుడు ఆ 11 వేల మైళ్లూ ప్రయాణంచేసి మళ్లీ ఆర్కిటిక్ ప్రాంతంలో వేసవి వచ్చినప్పుడు మళ్లా యీ 11 వేల మైళ్ల పొడవు ప్రయాణం చేస్తుంది. పక్షులవలస విషయంలో యీ నాటికీ అర్థంకాని విశేషం ఒకటి వున్నది. నివాసాల నుంచీ వెళ్లేటప్పుడు ముందు మొగపక్షులు పెద్దవి కదులుతాయి. వాటి తరువాత పెద్ద ఆడపక్షులు. కొంచెం ఎదిగిన పక్షులు వెనుకవుండి పోయి, రెక్కలురాని పక్షులను పోషిస్తుంటాయి. తిరుగు ప్రయాణంలో ముందు చిన్నపక్షులు దారితీస్తాయి. వాటివెనుక ఆడపక్షులు; చిట్ట చివరను పెద్ద మొగపక్షులు వెళ్తాయి. ఈ చిన్నపక్షులు అంతకు ముందు ఆదారిని ప్రయాణం చేయన్నివైనా సరే, లోగడ తమగుంపు ఏబాటను వచ్చాయో సరిగా అనే బాటును వెళ్లి, లోగడ తమ పక్షుల నివాసాలు ఏవో సరిగా అక్కడే వాలుతాయి. అలా దారిని కనుక్కొనే శక్తి వాటి తత్వంలోనే వున్నదని శాస్త్రజ్ఞులు అంటున్నారు. విదేశాలలో పలువురు కొన్ని పక్షులను పట్టితెచ్చి వాటికాళ్లకు చిన్న అల్యూమినియం రింగులు తగిలిస్తారు. ఆ రింగులకు లోతట్టున ఏతేదీన పట్టింది, ఎవరు పట్టింది, ఎక్కడ పట్టుపడింది వ్రాసి వదిలివేస్తారు. ఆపక్షి కనుపించకుండా పోయి మళ్ళీ ఒక ఏడాది గడిచాక అదే ప్రాంతంలో వెదికి చూస్తే, యీ వివరా లన్నిటితో, సహా ఆ ఎల్యూమినియం రింగ్ వున్న పక్షులు కనుపించేవి.

మనదేశంలో పక్షుల జీవితాలను గూర్చి పరిశోధనలు చెప్పుకోదగినంతగా జరుగలేదు. పక్షుల జీవితాలను బట్టి మనం నేర్చుకోవలసిన ఎన్నో విషయాలు వున్నాయని మాత్రం గట్టిగా చెప్పవచ్చు. ★

# హకల్‌బెరీ ఫిన్

(31-వ పేజీ తరువాయి)

మాట్లాడుకుంటారేమో తెలుసుకోవా లనిపించింది. జిమ్ సరే వెళ్లమన్నాడు.

నదిలోకిదూకి బోటువైపు ఈదుకుపోయాను. బోటు దమీపానికి వెళ్లినతరవాత సద్దుకాకుండా మెల్లిగాయీది బోటుమధ్యభాగం దగ్గిర్నించిపైకి పాకాను. ఒకపక్కగా ఏవో బస్తాలున్నాయి. వాటి చాటున కూర్చున్నాను. నెగడువద్ద పదముగ్గురు మనుషులున్నారు. బహుశా వాళ్లు రాత్రి కాపలా వాళ్లై వుంటారు. చూట్టానికి గూండాలమోస్తరుగావున్నారు. వాళ్లదగ్గిర ఒక విస్కీకూజా, గ్లాసులు ఉన్నాయి. విస్కీకూజాకు విరామంలేకుండా పని తగులుతోంది. కాపలావాళ్లు తాగుతూ, పాటలుపాడుతూ గోలచేస్తున్నారు. ఒకడు కొన్ని చరణాలు పాడటం, ఆ చరణాలైనతర్వాత మిగతావాళ్లు "లాలలల్ల, లాలలల్ల, లాలలాలలా" అని వంతపాడటం, ఇదీపాట.

కొంతసేపటికి వాళ్లలో ఒకడు "ఇక చాల్లెండ్రా" అని విసుక్కున్నాడు. దాంతో పోట్లాట రేగింది. ఒకలావాటి రాక్షసుడులాంటి మనిషి లేచాడు. దెబ్బలాటకు సిద్ధమైనట్టు కోటు ఊడదీసి పారేశాడు. టోపీ నేలనేసికొట్టాడు. విసుక్కున్నమనిషి, లావాటి మనిషి ఇద్దరూ ఒకళ్లఎదురుగాఒకళ్లు నుంచున్నారు. చొక్కాచేతులుపైకి మడిచారు. కోపం తెప్పించుకునేందుకుగాను ఒకడు ఒకమాదిరితిట్లు తిట్టాడు. రెండోవాడు కొంచెం గట్టితిట్లు తిట్టాడు. మొదటివాడు ఇంకా గట్టిగా తిట్టాడు. అప్పటికి వేడెక్కింది. కలబడ్డారు. కొంతసేపు యథాశక్తిగా కిందామీదపడ్డారు. పోట్లాట ఎటూతెగలేదు. అందుచేత మరొకడు లేచాడు. 'నేను తేలుస్తా' నంటూ మొదటి ఇద్దర్నీ చెరోచేత్తో నొక్కిపట్టి, ఎత్తికొట్టాడు. తపతప ఇద్దర్నీ ఊపిరిసలపకుండా చితకతన్నాడు. పాపం వాళ్లిద్దరూ తోకలుముడిచి కిక్కురుమనకుండా తన్నులుతిన్నారు. చివరికి ఒకరినొకరు కావిలించుకుని 'నువ్వంటే నాకెంతోఇష్టం' అనీ, 'నువ్వంటే నా ప్రాణాలిచ్చేస్తా' ననీ ప్రేమగా మాట్లాడుకున్నారు. ఆవిధంగా దెబ్బలాట ముగిసింది.

తరవాత అందరూ మళ్లీ స్నేహంగా నెగడు చుట్టూచేరి చర్చలు ప్రారంభించారు. కుక్కల్లో ఎన్ని జాతులున్నాయో, ఏజాతికుక్కలు మేలురకమో మొదట నిర్ణయించారు. తరవాత ఆడవాళ్లలో ఎన్ని జాతులవాళ్లున్నారో, వాళ్లలో ఎవరు మేలురకమో నిర్ణయించారు. తగలబడుతున్న ఇళ్లను ఎల్లా ఆర్పాలి? రాజులకు ఎంతెంత ఆదాయంవస్తుంది? పిల్లుల్లో పిల్లులకి పోట్లాటపెట్టడమెల్లా? ఒకమనిషి మూర్ఛపోతే వాడికిఎల్లా స్మృతి తెప్పించాలి? మొదలైన ముఖ్యసమస్యలను చర్చించారు. ఆఖరిసమస్య నదుల్లో బురదనీళ్లుమంచివా, తేటనీళ్లుమంచివా? కొందరు బురదనీళ్లనీ, కొందరు తేటనీళ్లనీ వాదించారు. బురదగావుండే మిసిసిపీ నీళ్ళేమంచివనీ, ఆ నీళ్లు తాగితే మనిషి ఆరోగ్యంగా ఉంటాడనీ, కడుపులో బురదనీళ్లుంటే లోపల పంటలుకూడా పండించవచ్చనీ ఒకడు అన్నాడు. ఇంకొకడు ఈ వాదాన్ని సమర్థిస్తూ, ఓహియోనదిలో తేటనీళ్లుంటాయి గనకనే ఆనదిపక్కనఉండే శ్మశానాలలో చెట్లుఎత్తుగా పెరగవనీ, మిసిసిపీనదిపక్కన శ్మశానాలలో చెట్లు ఎనిమిది వందలఅడుగుల ఎత్తుదాకా పెరుగుతాయనీ అన్నాడు. దీన్నిబట్టి ఏం తేలుతోంది? ఓహియోనదినీళ్లు తాగిన వాళ్ల శవాలమట్టిలోంచి బలమైనచెట్లు మొలవవు. మిసిసిపీనీళ్లు తాగినవాళ్ల శవాల్లోంచి మంచిచెట్లు మొలుస్తాయి. కనుక మిసిసిపీలోని బురదనీళ్ళే ఉత్తమమైనవని తేల్తోంది.

ఈ సమస్యతరవాత పొగాకులోతేమ ఊరకుండా ఎప్పుడూ పొడిగానే ఉండేట్లుచెయ్యటమెలాగని చర్చించారు. తరవాత కొంతసేపు దెయ్యాల కథలు చెప్పుకున్నారు.

ఇంతలో వాళ్లలో ఒకడు ఎప్పుడువచ్చాడో బస్తాలదగ్గిరికి వచ్చాడు. నేను వాణ్ణి చూడలేదు; వాడు నన్ను చూడలేదు. చీకట్లో నామీదుగా పల్టీ కొట్టాడు. "బాబోయ్" అని కేకలుపెట్టాడు. వెంటనే కాపలావాళ్లు కర్రలూ, లాంతరూపట్టుకునివచ్చి నన్ను చూశారు. ఒకడు నన్ను బరబర ఈడ్చుకుంటూ నెగడువద్దకు తీసుకుపోయాడు.

"ఎవరునువ్వు? ఎందుకొచ్చావ్? నీళ్లలోకి తోసెయ్యండిరా. ముందసలు నాలుగువాయించండి," ఇల్లా తలోకమాటా అంటూ నా చుట్టూమూగారు.

"ఎంతసేపైంది నువ్వువచ్చి ?" అని ఒకడడిగాడు.

"ఇప్పుడేనండి. ఒకనిమిషమైంది," అని గజగజ వణుకుతూ అన్నాను

"నిమిషమేనా ? నిమిషంలో నీవొళ్లు ఎల్లా ఆరింది ?"

"నా కెప్పుడూ అంతేనండి. వంటిమీదనీళ్లు ఇట్టే ఆరిపోతాయి."

"నీ పేరు ?"

"ఎరిక్ జేమ్స్ హాప్‌కిన్స్."

"ఎక్కణ్ణుంచివొచ్చావు ?"

"మానాన్న వెనకాల ఒకపడవలో వస్తున్నాడు. మా నాన్న వ్యాపారంచేస్తూవుంటాడు. నేను మా పడవలోంచి మీ బోటును చూశాను. నేను పొగబోటు నెప్పుడూ చూడలేదు. అందుకని చూద్దామని మా నాన్నతో చెప్పకుండా ఇక్కడికి యీదుకుంటూ వచ్చాను."

"ఏమన్నా దొంగిలిద్దామనుకున్నావా ?"

"లేదండి. పూరికే చూద్దామనేవచ్చాను."

"అయితే చీకట్లో ఎందుకు దాక్కున్నావు!"

"మీరుచూస్తే కొడతారని దాక్కున్నాను."

"ఇప్పుడు నిన్ను వదిలేస్తే ఇంకెప్పుడూ ఇల్లాంటి పనులు చెయ్యవుగా?"

"చెయ్యనండి."

"సరే. జాగ్రత్తగా వుండు ఇకమీద. మేము గనక ఏం చెయ్యకుండా వదిలేస్తున్నాం. ఇంకోళ్లయితే చర్మం వొలిచేసే వాళ్లు. ఫో."

ఆమాటనగానే గభాలున నీళ్లల్లోకి దూకి ఒడ్డు దగ్గర్లోనే వున్నందున ఒడ్డుకి యీదుకుటుంపోయాను. జిమ్ పడవ వచ్చేటప్పటికి పొగబోటు చాల దూరం వెళ్లిపోయింది. పడవలోకెక్కి క్షేమంగాతిరిగి రాగలిగినందుకు చాలానంతోషపడ్డాను. (ఇంకావుంది)

## ఆ రోజు

(27-వ పేజీ తరువాయి)

చంపుదామను కొన్నా బయటికి రావడం లేదుట.

ఇంతలో మా రాజారావు బాట్ గిరగిర త్రిప్పుకొంటు ఆగదిలో కెళ్ళాడు. "ఏం చేద్దామా?" అన్న ఆలోచనలో పడ్డారు అంతా. ఎట్లాగయినా మా రాజా స్కూలు ఫైనలు స్టూడెంటు కదూ? కాస్త తెలివి ఉపయోగించాడు. (స్కూలు ఫైనలు ఫేలు అయ్యాడు లెండి.) "కాస్త మట్టి తీసుకు ఎత్తెయండ్రా" అని సలహా ఇచ్చాడు. అంతా బావుందంటే బావుందన్నారు. మట్టి తీసుకొని కన్నం పూడ్చబోయింది, అక్క. "జాగ్రత్త పిల్లా అది పొడుస్తుంది" అని హెచ్చరించింది బామ్మ. ఆవిడకు భయం. పెద్దప్రాణం కదూ?

మళ్ళీ అందరి దృష్టి దొడ్లోకి పోయింది. నేను గదిలో చచ్చిపోతున్నాను, మిరవకాయ అఘాటుకు. పోపు వేయిస్తూ అమ్మ ఈ గొడవలో పడిందేమో? "అమ్మా!" అని కేక వేశాను. ఆవిడొచ్చింది. "అమ్మా పోపు మాడింది" అన్నా. సరే అంటూ విసుక్కొంటూ వెళ్ళింది. ఇంతలో శ్రీనిగాడు వచ్చాడు. బామ్మ "వెధవా ఇప్పుడు దిగావా చెట్టు మీద నుంచి" అంటూ మీద పడింది. "నేను ఇప్పుడే వచ్చానమ్మా" అంటున్నాడు. "వెధవా నేను చూడలేదా నిన్ను" అంది బామ్మ. "అమ్మా! అన్నయ్య ఇంకా చెట్టుమీద నుంచి దిగమన్నా దిగటం లేదే" అంటూ వచ్చింది చెల్లి-

శ్రీనును చూచి నిర్ఘాంతపోయింది. మరి చెట్టుమీద ఎవరు? సందేహం అందరి బుర్రలలోను మెలిసింది. అందరూ చెట్టుదగ్గిరకి వెళ్ళేటప్పటికి నేను నిన్న పోయిందనుకొన్న చొక్కా వస్తువది. దాన్ని చూచి మనిషి అనుకొన్నారు. మరి ఎవరు విరిచారు కొమ్మని? అందరి దృష్టి అక్కడే. చెట్టు మీద నుంచి వ్రేలాడుతున్న కొబ్బరిమట్ట వెక్కిరిస్తూ కనిపించింది. ★



ప్రేమకథలలో ప్రపంచాన్ని మరిచిన ప్రేమికులు నాగేశ్వరరావు, భానుమతి (భరణీవారి "ప్రేమ")

# ★ సినిమా వార్తావాహిని ★

## పీపుల్స్ వారి పల్లెటూరు

సావిత్రి, ఎన్. టి. రామారావు, రంగారావు, టి. జి. కమల, శేషమాంబ, కొమ్మూరిపద్మావతి, పోడూరి అచ్చయ్య, రమణారెడ్డి, కుటుంబరావు మొదలైనవారు నటిస్తున్న పీపుల్స్ వారి "పల్లెటూరు" సాంఘిక చిత్రం షూటింగ్ జోరుగా సాగుతోంది. ఔట్ డోర్ షూటింగ్ పూర్తి చేసుకుని సెట్లపైన షూటింగ్ ప్రారంభించారు. నాలుగు పాటల వరకూ రికార్డు అయినవి. సగం చిత్రం పూర్తయినట్లె మే నెలాఖరికి చిత్రం పూర్తి కాగలదని నిర్మాతలలో ఒకరైన దుర్గాప్రసాదరావుగారు చెబుతున్నారు

## "రోహిణి"

మాధురీదేవి (మద్రాస్ ఆర్టు ప్రొడక్షన్స్) "రోహిణి" అనే సాంఘిక చిత్రం తీయ సంకల్పించినది. ఈ చిత్రానికి మాతృక బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన 'కృష్ణకాంతుని మరణశాసనం' అనే నవల

## "చంద్రహారం"

విజయావారి "చంద్రహారం" షూటింగ్ చురుగ్గా జరుగుతున్నది. కె. కామేశ్వరరావుగారు దర్శకత్వం, పింగళి సంభాషణలు, ఘంటసాల సంగీతం నిర్వహిస్తున్నారు ఎన్ టి. రామారావు, శ్రీరంజని, సావిత్రి, రేలంగి, జోగారావు, శేషమాంబ, దొరస్వామి మొదలగువారు నటిస్తున్నారు. గోఖలే తయారుచేసిన సెట్టింగులు చూస్తే పాతాళభైరవిలో కంటే భారీ ఎత్తున ఉన్నట్లు తోస్తున్నది ఈ చిత్రాన్ని ప్రత్యేకంగా హిందీలో కూడా షూట్ చేస్తారట.

* * *

'పెళ్లిచేసి చూడు' చిత్రాన్ని విజయా వారు హిందీభాషలోకి కూడా 'డబ్' చేస్తున్నారు. తమిళంలోకి 'డబ్' చేసిన ఈ చిత్రంలో కొత్తవిశేషమేమంటే కథ మధ్యలో చిన్నపిల్లలు ప్రదర్శించే 'సత్యమేజయం' నాటక దృశ్యాన్ని "గేవార్ట్" రంగు ఫిల్ముమీద ముద్రిస్తున్నారట.

* * *

వాహినీ వారి 'పెద్దమనుషులు' చిత్రం ఇంకా స్క్రిప్టు దశలోనే ఉన్నట్లు తెలుస్తోంది.

## "గుడ్ ఈవెనింగ్"

కృష్ణవేణి స్థాపించిన విజయలక్ష్మి ప్రొడక్షన్సు వారు త్వరలోనే "గుడ్ ఈవెనింగ్" అనే తెలుగు చిత్రం తీయనున్నారు. దీనికి డిస్ట్రిబ్యూటర్లు చమ్రియా రిలీజ్ వారు.

* * *

ఎ. వి. ఎమ్. స్టూడియో వారు "చెల్లపిళ్లై" (ముద్దుల మరది) అనే తమిళ చిత్రాన్ని, అదే కథతో "వదినె" అనే తెలుగు చిత్రాన్ని తీస్తున్నారు.

* * *

భరణీ వారి కొత్త చిత్రం "చండీరాణి" షూటింగ్ ఈనాడే (మార్చి 26) ప్రారంభమౌతున్నది.



ఈ నెల 6 న అభ్యుదయాఫిలిమ్స్ ప్రారంభోత్సవం జరిగింది. చిత్రంలో జంపన, నారాయణరావు, శివరావు, పెండ్యాల, మొదలైనవారున్నారు. వీరు "కూలి" సాంఘిక చిత్రం తీస్తున్నారు.

సి. పుల్లయ్యగారి దర్శకత్వాన నడుస్తున్న "ధర్మదేవత" (రాగిణీ ఫిలిమ్సు) షూటింగ్ అయిపోవచ్చింది. యువా వారి "టింగ్ రంగా" కూడా పూర్తికానున్నట్లు తెలుస్తోంది. ప్రసాద్ దర్శకత్వం నిర్వహిస్తున్న "పరదేశి" షూటింగ్ చకచకా జరుగుతున్నది. నవయుగ వారి "జ్యోతి" ఏమైనదీ తెలియటం లేదు.

సినిమా రంగంలోకి ప్రవేశిస్తూనే తారాపథంలో అడుగుపెట్టిన సావిత్రి మొత్తం 8 చిత్రాలలో—ఎ. వి. ఎమ్. వారి "పదిసె", శుభోదయావారి "ఆదర్శం", సి. పుల్లయ్యగారి "సంక్రాంతి", జంపన వారి "మేనరికం", వినోదా వారి "దేవదాసు", పీపుల్స్ వారి "పల్లెటూరు", విజయవారి "చంద్రహారం", నవయుగవారి "జ్యోతి" చిత్రాలలో ముఖ్య పాత్రలు ధరిస్తున్నది.

* * *

అందాల పోటీలో "మిస్ మద్రాస్" బిరుదుపొందిన శ్రీమతి టి. సూర్యకుమారి ఏప్రిల్ మొదటివారంలో అఖిల భారత పోటీ నిమిత్తం బొంబాయి వెళ్ళవచ్చునని తెలుస్తున్నది. ★

## డాక్యుమెంటరీ చిత్రాలు

డాక్యుమెంటరీ చిత్రాల నిర్మాణంలో భారత ప్రభుత్వపు ఫిల్ముశాఖ ప్రశంసనీయమైన కృషిచేస్తోంది. కథా చిత్రాలకంటె డాక్యుమెంటరీ చిత్రాల నిర్మాణం వ్యయ ప్రయాసలతోను, సాహసంతోను కూడిన పని. కథా చిత్రాలలో అందరికీ ఆసక్తి కలిగించే కథ ఉండటం మూలాన టెక్నికల్‌గా ఎలాటి అవకతవకలు జరిగినా ప్రేక్షకులు పట్టించుకోరు. డాక్యుమెంటరీలలో కథ ఉండదు; యథార్థంగా జరిగిన విషయాలనే, అదైనా విజ్ఞానకర సమాచారాలనే వస్తువుగా తీసుకోవలసి ఉంటుంది. ఈ కారణంచేత టెక్నికల్



అజంతా వారి “వయ్యారి భామ”లో ఆశ్చర్యార్థకముఖం పెట్టిన సి. ఎస్. ఆర్. →

ఎ. ఎన్. ప్రొడక్షన్సువారి “ఆడబ్రతుకు”లో నల్లరామ్మూర్తి, కనకం, రఘురామయ్య సీతారామయ్య.

నైపుణ్యం అత్యున్నత స్థాయిలో ఉంటే తప్ప డాక్యుమెంటరీలు రక్తి కట్టవు ఇదీ గాక డాక్యుమెంటరీలలో తగినంత హాస్యం, చైతన్యం ఉండాలి. ఇన్నీ ఉన్నా డాక్యుమెంటరీలు కథా చిత్రాల మాదిరిగా ఆర్థిక విజయం పొందుతాయని చెప్పటానికి లేదు.

ఈ కారణంచేతనే మన దేశంలో చిత్ర నిర్మాతలు డాక్యుమెంటరీల నిర్మాణానికి సాహసించ లేకుండా ఉన్నారు. దేశంలో తయారయ్యే డాక్యుమెంటరీలలో దాదాపు అన్నీ భారతప్రభుత్వమే నిర్మిస్తున్నది. వాటినైనా ప్రతి సినిమాహాలులోను నిర్బంధంగా ప్రదర్శింప జేయవలసి వస్తోంది. ఇంగ్లీషు హిందీ, తెలుగు, అరవం, బెంగాలీ, భాషలలో వ్యాఖ్యానంతో ఈ చిత్రాలు తయారవుతున్నాయి. ప్రభుత్వ ఫిల్ము శాఖ ఏర్పడి నాలుగేళ్ళయినా కాలేదు ఈ స్వల్పకాలంలోనే ఈ శాఖ చెప్పుకోదగిన మంచి చిత్రాలు తీసింది. మన ఫిల్ముశాఖ తయారుచేసిన కొన్ని డాక్యుమెంటరీలకు అంతర్జాతీయ పోటీలలో బహుమతులు కూడా లభించాయి.

మన ఫిల్ముశాఖవారు తీసిన చిత్రాలలో చాలా ఆకర్షణీయంగా ఉన్న వాటిలో "కాశ్మీర్ లోయ" అనేది ఒకటి. ఇది వర్ణచిత్రం. కాశ్మీర్ దేశంలోని ప్రకృతి సౌందర్యాన్ని, ప్రజల జీవన విధానాన్ని, వారి వృత్తులు, చేతిపనులు, వినోద వ్యాసంగాలు, కళలు మొదలైన వాటిని ఈ చిత్రం చాలా చక్కగా చూపించింది. ప్రస్తుతం ప్రభుత్వ ఫిల్ము శాఖవారు "కుమావూన్ కొండలు" అనే టెక్నికలర్ చిత్రాన్ని, హాలీవుడ్‌లో ముద్రిసున్నారు.

డాక్యుమెంటరీలు ప్రజాదరణ పొందాలంటే చిత్రం రసవంతంగా ఉండటం చాలా అవసరం. యధార్థ సంఘటనలలో నుండి రసం సృష్టించటం చాల కష్టం. అయినా ఫొటోగ్రఫీ, సౌండు, ఎడిటింగు పద్ధతులలో చాకచక్యం చూపిస్తే రససృష్టి కావటానికి వీలున్నది. ఇది గాక ఆరోగ్యం, విద్య మొదలైన వాటిని గూర్చిన విజ్ఞానాన్ని ప్రజలకు అందజెయ్యటానికి కేవలం జరిగిన సంఘటనలనే తీసుకోనక్కర్లేదు. ఈరకం చిత్రాలను దాదాపు కథా చిత్రాల మల్లేనే తీయవచ్చు: మన ఫిల్ముశాఖ ఇలాంటి చిత్రాలు చాలా తీసింది. ఆరోగ్యానికి సంబంధించిన ఒక డాక్యుమెంటరీలో ఎక్కడ పడితే అక్కడ తుమ్మటాన్ని గూర్చి హాస్యవంతమైన చక్కని దృశ్యం ఒకటున్నది. రైల్లో కూర్చున్న ఒక ప్రయాణీకుడు ఎదటి సీటులో కూర్చుని కునికిపాట్లు పడుతున్న మరొక ప్రయాణీకుని ముఖంమీదికి తుమ్ముతాడు. తుమ్ముతుప్పర్లు తుడుచుకుంటూ రెండో ప్రయాణీకుడు వాన జల్లు పడుతోంది కాబోలనుకుని కిటికీ తలుపులు మూసేసి మళ్ళీ కునుకుతాడు. మొదటి ప్రయాణీకుడు మళ్ళీ అలాగే తుమ్ముతాడు. ఈసారి రెండో ప్రయాణీకుడు అది తుమ్ము తుప్పర అని గ్రహించి దెబ్బలాటకు సిద్ధమౌతాడు ఈ దృశ్యంలో సున్నితమైన హాస్యం వున్నది. హాస్యం ద్వారా డాక్యుమెంటరీలను ఆకర్షకం చెయ్యటం తేలిక.

అమెరికా, బ్రిటన్, ఇటలీ, ఫ్రాన్సు మొదలైన దేశాలలో ప్రైవేటు నిర్మాతలే డాక్యుమెంటరీల నిర్మాణం సాగిసు



జంపనవారి "మేనరికం"లో సీతపాత్రధారిణి జి. వరలక్ష్మి.



ఆర్. పద్మనాభన్ వారి "రాజేశ్వరి"లో

మాధురిదేవి

స్తున్నారు. మన ప్రభుత్వం విస్తృతంగా ఈ చిత్ర నిర్మాణం సాగించలేని స్థితిలో ఉన్నది. స్వంత పెట్టుబడిదారులు ముందుకు వచ్చి డాక్యుమెంటరీల నిర్మాణానికి పూనుకుంటే ఈ రంగంలో కళావిజయం కంగా సాధించవలసినదెంతైనా వున్నది.

## "ది రివర్"

భారత దేశంలో తయారైన మొట్టమొదటి టెక్నికలర్ చిత్రం "ది రివర్" అమెరికాలో విడుదలయి చాల రోజులైంది. ఇటీవల మన దేశంలో కూడా కొన్నిచోట్ల విడుదలైంది. రూమర్ గాడెన్ అనే ఆమె వ్రాసిన కథ ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడింది. 1951 లో వెనీస్‌లో జరిగిన అంతర్జాతీయ ఫిల్మ్ ఉత్సవంలో ఈ చిత్రం ప్రథమ బహుమతి పొందింది. భారతీయ జీవన విధానాన్ని సానుభూతితో పాశ్చాత్యులకు బోధపరచటానికి ఈ చిత్రంలో ప్రయత్నం జరిగింది.

చిత్రం నిర్మించిన కెన్నెత్ మెక్ఎల్డౌనీ తన "దిరివర్" ను అమెరికన్ చిత్రంగా పరిగణించటానికి నిరాకరించాడు. భారత దేశంలోనే పూర్తిగా తయారుకావటం, భారతీయధనం కొంత, భారతీయ టెక్నీషియన్ల సహాయంకొంత చిత్ర నిర్మాణంలో పాలు పంచుకోవటం వల్ల ఇది భారతీయ చిత్రమేనని మెక్ఎల్డౌనీ పట్టుబట్టాడు. వెనీస్‌లో భారతీయ చిత్రంగానే ఇది బహుమతి పొందింది. ఈ చిత్రానికి దర్శకుడు జీన్ రెనాయిర్. ★



తారాశశాంకం రహస్యాలు రేవతికి బోధిస్తున్న ఆత్రేయ.
శుభోదయా వారి "ఆదర్శం"లో



## మద్రాసు డైరీ

(3-వ పేజీ తరువాయి)

మీద, వివరాల (*Detail*) మీద ఎక్కువ శ్రద్ధ కనిపిస్తుంది. ఒక రష్యన్ చిత్రానికి అధ్యక్షుడు రాజేంద్ర ప్రసాద్ గారి బహుమానంకూడా లభించింది. బాలబాలికలు ఏ దేశం వారైనా వారి ఊహలు, భావనాశక్తి ఒక విధంగానే ఉంటాయి. ఈ ప్రదర్శనంలో కొన్ని చిత్రాలు నిజంగా బాలురు వేసినవేనా అని ఆశ్చర్యం కలిగించేటంత బాగున్నాయి.

*   *   *

నిర్వచనం :

మేధావులు— మేధకలిగిన ఆవులు.

—సవ్యసాచి

# రెండు మహానగరాలు

(7-వ పేజీ తరువాయి)

చక్రాలు కట్టడానికీ, కోచ్‌తలుపులు తెరిచి ప్రయాణీకుల్ని లోపలికి యెక్కించటానికీ గార్డు క్రిందికి దిగాడు.

'హో!—' అని కంగారుగా కేక పెట్టాడు కోచ్‌వాలా.

'ఏమిటి టామ్!—'

దూరాన వినిపిస్తున్న గుర్రం డెక్కలచప్పుడు, ఇద్దరూ చెవులు దోరపెట్టి పసిగట్టారు.

'గుర్రం గాలపు మీద వచ్చేస్తోంది'—

'గాలపుగాదు పేరాంమీదే వచ్చేస్తోంది' అంటూనే గార్డు చివాల్న కోచ్‌మీదికి యెగిరి తన స్థానంలో సిద్ధంగా నిల్చున్నాడు.

'ఆంగ్లరాజు పేరిట అంతా సిద్ధంకండి!'—అని ప్రయాణీకుల్ని హెచ్చరించాడు. ఈ హెచ్చరిక చేస్తూనే తుపాకి చేతులోకి అందుకున్నాడు.

మన గాథకు సంబంధించిన ప్రయాణీకుడు కోచ్‌లోకి ఎక్కటానికి మెట్టుమీద అడుగువేసినవాడు అలానే ద్వారానికి అర్ధంగా మెట్టుమీద నిలబడిపోయాడు. తక్కిన యిద్దరూ ఇంకా రోడ్డుమీదనే నిల్చున్నారు. ముగ్గురూ కలిసి కోచ్‌వాలా ముఖం వంకా, గార్డు ముఖంవంకా మూస్తూ బిక్కుబిక్కుమంటున్నారు. మొమ్మొన గుర్రంకూడా, ఏదో ప్రమాదం జరిగేలానే వున్నదన్నట్టు, చెవులు రిక్కించి వెనక్కుదిరిగి చూచింది.

కోచ్ నిలబడివుంది; గుర్రాలు కాళ్ళుకూడా కదపటంలేదు. అర్ధరాత్రి సమయం—ఎక్కడా చీమైనా చిటుక్కుమనడంలేదు. —ఒక భయంకర నిశ్శబ్దం; ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని ఛేదించుతూ దూరాన గుర్రపుడెక్కలచప్పుడు వినిపించుతోంది.

అలసివున్న కోచ్‌గుర్రాలు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తీయటంతో బండి, వెనక్కూ ముందుకూ, కొంచెంగా ఊగిసలాడుతూ ఏదో ఆందోళన పడుతున్నట్టు కనుపించుతోంది. ప్రయాణీకుల గుండెలుకూడా, దడదడా కొట్టుకుంటున్నయ్.

కొండమీదికి పరుగెత్తుకొస్తున్న గుర్రం డెక్కలచప్పుడు అంతకంతకు సమీపాన వినిపిస్తోంది.

'ఓహోయ్!'—గార్డు, పొలికేకగా, శక్తికొద్దీ గర్జించాడు: ఆగక్కడ! కాల్చిపారేస్తాను!'

డెక్కలచప్పుడు హఠాత్తుగా ఆగిపోయింది: 'ఆ వచ్చేది డోవర్ మెయిలేనా?' అన్నమానవకంఠం, దూరాన్నుంచి కళవళంగా వినిపించింది.

'ఏదైతే నీకెందుకు?—అసలు నీ సంగతేదో తేల్చు'—గార్డు మొండి సమాధానం చెప్పాడు.

'డోవర్ మెయిలేనా?'—

'అయితే ఏమిటి?'—

'ఒక ప్రయాణీకుణ్ణి కలుసుకోవాలి'—

'ప్రయాణీకుడా?'

'జర్విస్ లారీ కోచ్‌లో వున్నారా?'—

ఆ మనిషి తనే అయినట్టు మనబాటసారి వెంటనే తెలియ

జేశారు. గార్డూ, కోచ్‌వాలా, మిగతా యిద్దరు ప్రయాణీకులూ అతనివంక అనుమానంగా చూశారు.

'సరే అక్కడే నిలబడు!—ముందు కదుగే ప్రేమాత్రం—ఖబ్దార్' అని దూరాననున్న మనిషిని హెచ్చరించాడు, గార్డు. మన ప్రయాణీకునివంక చూసి: 'ఎవడో కనుక్కోండి' అన్నాడు.

'ఎవరదీ?—జర్రీ!

'అవును సర్—నేనే'

'ఏమిటి సంగతీ?—'

'కంపెనీవాళ్లు మీకో మాట చెప్పమన్నారు సర్!'

'ఈ మనిషిని నేను ఎరుగుదును గార్డ్!' అంటూ రోడ్డు మీదికి దిగాడు లారీ, తక్కిన ప్రయాణీకులిద్దరూ, అతనికి సహాయం చేస్తున్నవాళ్లులానే నటించి, అతన్ని మెల్లిగా రోడ్డు మీదికి తోసేసి గబుక్కున తలుపులు మూసుకుని లోపల కూర్చున్నారు. కిటికీ తలుపులు కూడా దించేశారు.

'అతన్ని దగ్గరికి రానివ్వు; మరేం భయం లేదు.' అన్నాడు లారీ.

'భయం లేదని నేననుకుంటాననుకోండి-జాలికంతకీ అలాంటి నమ్మకం కలిగించటమెలా?' అన్నాడు గార్డు.

'ఏయ్!' అని కేక పెట్టాడు దూరానున్న మనిషిని.

'ఓయ్!' అని జర్రీ సమాధానమిచ్చాడు.

'ఒక్కొక్క అడుగే నెమ్మదిగా ముందుకురా - నా సంగతి తెలుసుగా—జీను పక్కని పిస్టలు గిస్టలుండేమో—చెయ్యి అటు కళ్ళే పోనిచ్చావా—నా సంగతి తెలుసుగా!'—

గుర్రం, మనిషీ మంచుతెరలోనుంచి నెమ్మదిగా బయటికి వచ్చారు. జర్రీ నెమ్మదిగా గుర్రాన్ని నడిపించుకుంటూ మెయిల్ కోచ్‌కి పక్కగా వచ్చి జర్విస్ లారీ ముందు ఆగాడు. గార్డు వంక వారగా చూస్తూ, చేతిలో వున్న వుత్తరం లారీచేతిలో పెట్టాడు. రౌతూ గుర్రమూ కూడా, గుర్రం పాదాలనుంచి, మనిషి టోపీ వరకూ బురదతో మునిగున్నారు.

వ్యాపారస్తుని ధీమాతో 'గార్డ్' అని పిలిచాడు, లారీ.

ఒకచేత్తో తుపాకీ రెండో చేత్తో పిస్టలూ పట్టుకుని, కొత్తగా వచ్చిన మనిషివంక కొట్లకుక్కలా చూస్తున్న గార్డు: 'సర్!' అని కటువుగా సమాధానం చెప్పాడు.

'ఇందులో ప్రమాదం వచ్చేదేమీ లేదు. నేను టెల్‌సన్సు బ్యాంకు తాలూకు ఉద్యోగిని; బహుశా లండన్‌లో వున్న టెల్‌సన్సు బ్యాంకు సంగతి నువ్వు వినేవుంటావ్. నేను వ్యాపార విషయాలు చూసుకోవటానికి పారిస్ వెళ్తున్నాను—ఇందులో మోసమేమీ లేదు. ఈ చీటీ కాస్త చదువుకోనీ'—

'సరే త్వరగా చదవండి సర్!' అన్నాడు గార్డు—ఇంకా అపనమ్మకంగానే.

అతను ఆ చీటి తీసుకుని కోచ్ లైట్ ముందుకు వెళ్ళి విప్పి చూచాడు. ముందు తనలోతను నెమ్మదిగా చదువుకున్నాడు; తర వాత బిగ్గరిగా చదివాడు.

"డోవర్‌లో ఆగవలెను; ఆవిడ వచ్చి కలుసుకుంటుంది."

జర్రీవంక తిరిగి: 'పునర్జన్మ' అన్నానని చెప్పు.'

'అరె! అదేం సమాధానమండీ! బలే చిత్రంగా ఉందే' అని తెల్లబోయాడు జర్రీ.

ఆ మాట చెప్పు—నాకీ వర్తమానం అందినట్టు వాళ్ళకి తెలుస్తుంది; చీటి అక్కర్లేదు; వెళ్ళిరా'—

ఈ రెండుముక్కలూ చెప్పి వెంటనే కోచ్ తలుపు తీసి చివాల్న లోపలికి ఎక్కికూర్చున్నాడు. లోపలున్న ప్రయాణీకు లిద్దరూ తమ చేతిగడియారాలూ, పర్సులూ అదివరకే కాలికి తొడుక్కున్న జాక్ బూట్లలో దోపేశారు; ఇప్పుడు అతను లోపలికి రావటం మాని నిద్రపోతున్నట్టు నటిస్తున్నారు—ఇంకేవి చెయ్యటానికీ తోచక.

కోచ్ మళ్ళా నెమ్మదిగా బయలుదేరి కొండమీదినుంచి క్రిందికి దిగుతోంది. మరింత దట్టంగా మంచు అలుముకుంటోంది. గార్డు తన తుపాకులూ జట్టా తిరిగి యథాప్రకారం సర్దేసుకుంటున్నాడు.

'టామ్'—అని కోచ్‌వాలా నెమ్మదిగా టాపుమీదినుంచి గార్డును పిల్చాడు.

'ఏమిటి?'

'ఆ సమాధానం విన్నావా?'

'విన్నాను.'

'నీకేమన్నా అర్థమైందా?'

'రవ్వంతైనా అర్థం కాలేదు'

'భలేపని—నాకూ అర్థం కాలేదు'—.

చీకటిలో దిగబడిపోయిన జర్రీ నెమ్మదిగా గుర్రందిగి దానికి కొంచెం విశ్రాంతినిచ్చాడు. మొహంమీద కొట్టుకున్న బురద అరచేత్తో తుడిచేసుకున్నాడు. నెత్తిమీదవున్న టోపీతీసి దులిపితే అరగాలన్ వరకూ నీళ్లు కారాయి. గుర్రం నోట్లోనుంచి కళ్లెంతీసి బురద కొట్టుకున్న దండ చేతిమీద వేసుకుని, మెయిల్ కోచ్ చక్రాల ధ్వని వినిపించకుండా పోయేవరకూ అక్కడే నిల్చున్నాడు. అనంతరం నెమ్మదిగా కొండమీదినుంచి క్రిందికి దిగటానికి బయలుదేరాడు:

'రా! ముసలావిడా! ఆ గాంభ్‌తో మొత్తబడిపోయావ్!— మైదానం మీదికి వెళ్లేదాకా నీ ముంగాళ్ళను నమ్మటానికి వీల్లేదు' అన్నాడు తన ఆడగుర్రంవంక ఆప్యాయంగా చూస్తూ.

"పునర్జన్మ"— బలే మాట!— ఇల్లాంటి వ్యవహారాలన్నీ నీవంటి వాడికి పనికిరావు జర్రీ! —ఇలాంటి పునర్జన్మలూ, బ్రతుకులోకి అడుగుపెట్టటాలూ, తప్పదాగటాలు మొదలెట్టావంటే— నీ జీవితం మరింత డొంకదోవన బడుతుంది!'



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7. Thambu Chetty St., Madras



ఓరుగల్లు కాకతీయ కళాసమితి జనవరి ఉత్సవాలలో ప్రదర్శించబడిన శ్రీ త్యాగరాజమహర్షి చిత్రపటం

Regd No. M. 4479

సాహసకృత్యాలతో నిండిన

ఉత్తమ చిత్రం













డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్రా, సీడెడ్ జిల్లాలకు:
నవయుగ ఫిలిమ్స్, విజయవాడ.



నైజాం స్టేటుకు:
ప్రీమియర్ పిక్చర్స్, హైదరాబాద్.